# మీ పాపాయికి బుద్ధి చెప్పినట్లే ఆ జలుబుకూ స్వస్తి చెప్పండి. మందలించండి, ముద్దుచేయండి.




## రబెక్స్

## అంతా మీ ధోరణిగలదే! జలుబుపై ఓ దెబ్బవేసి ముద్దుగా దూరం చేస్తుంది. ఆపైన మీ పాపాయికి ఉపశమనం, హాయి...

# రబెక్స్

రబెక్స్‌లోని జలుబు నుండి ఉపశమనాన్ని కలిగించే విశ్వసనీయమైన ఆరు ఔషధాలు (మెంథాల్, కేంఫర్, థైమాల్, టర్పెంటైన్, యూకలిప్టస్ ఆయిల్, నట్‌మెగ్ ఆయిల్), మీరు అతని ముక్కుపై, గొంతుకపై, ఛాతీపై, వీపుపై రాయగానే వేడి హాయిని వ్యాపింప చేసి ఉపశమనాన్ని కలిగిస్తాయి రబెక్స్ త్వరలోనే అతని ముక్కు దిబ్బడను, ఛాతీలో బిరుసును పోగొట్టి హాయిగా ఊపిరి పీల్చుకునేందుకు తోడ్పడుతుంది. మీతోనూ, రబెక్స్‌తోనూ మీ పాపాయిలో నవ్వులు కోకొల్లలు త్వరలోనే

మంటగానీ, అంటుకు పోవడంగానీ లేకుండా జలుబుల నుండి ఉపశమనాన్ని కలిగించే శక్తివంతమైన మలాము

గ్లైకోడిన్ వంటి అధునాతనమైన మందులను తయారుచేసే Alembic అలెంబిక్ ఉత్పాదన

everest/665/ACW-11

తప్పక చూడండి!

డూండీ సమర్పించు
త్రిమూర్తి ప్రొడక్షన్స్




alpana దర్శకత్వం కె యస్ ఆర్ దాస్, నిర్మాతలు పి బాబ్జి, జి సాంబశివరావు

DIMPLE

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938-1972]

శుక్రవారం : 21-7-'78
కాళయుక్తి నామ సం. ఆషాఢ బ. విదియ
**సంపుటము 71 : సంచిక 44**

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60
ఆరు మాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక




రాత్రిపూట సుఖంగా
నిద్రపుచ్చి ప్రొద్దున్నే
చేవతో తాజాగా
వుండేలా తయారు
చేస్తుంది.

**వివా, రోజంతటకీ కావలసిన చేవను పెంపొందిస్తుంది !**

వివాలోని ఆధునికమైన సూత్రీకరణ మూలంగా, దీనితో శక్తి నిచ్చే మాల్ట్ ధాతువులు (టిష్యూ) పెంపొందించే ప్రోటీన్లు వున్నాయి. ఇవి పనికి అటకే కావలసిన శక్తిని పెంపొందిస్తాయి

**వివా, ఖర్చయిన మీ శక్తిని భర్తీ చేస్తుంది రాత్రిపూట !**

పడుకోబోయేముందు రుచికరమైన వేడి వివా ఒకకప్పు తీసుకుంటే అది మీకు విశ్రాంతినిచ్చి మారు పొద్దున్నే తాజాగా మంచాకుని నిద్రలేచేదాకా పోషక శక్తిని సమకూరుస్తూనే ఉంటుంది






**మీకు తెలుసా ?**

కోల్పోయిన శక్తిని భర్తీ చేసే విషయంలో అది భర్తీ చేయబడని డాక్టర్ల అభిప్రాయం. పోషక శక్తిని పెంపొందించే ప్రక్రియనూ శరీరానికి అవసరమయ్యే మరమ్మత్తు పరిచేయడాన్ని నిద్ర సాధ్యం చేస్తుంది




నిద్రావస్థ, దశలు దశలుగా తీరులో ఉంటుందని వివరిస్తోంది విజ్ఞాన శాస్త్రం. వివా మీకు విశ్రాంతిగా సరియైన పద్ధతిలో నిద్రపట్టేలా చేస్తుంది. మీరు ప్రొద్దున్నే తాజాగా మంచాకుని నిద్రలేచే వరకూ, మీకు కావలసిన పోషక శక్తిని సమకూరుస్తుంది.

పగలూ, రాత్రీ,
ఆరోగ్యన్నిచ్చే పానీయం
రుచికరమైన
**వివా**




**జగత్‌జీత్ ఇన్‌డస్ట్రీస్ లిమిటెడ్.**

పి.ఓ. జగత్‌జీత్ నగర్, కపూర్‌థలా జిల్లా (పంజాబ్)

ASP/JIL/1A/78

కోకెంపోకడ-టోమ్సన్




# ఉత్తరాలు

## పుష్పవికాసం

సినీ నటుల ముఖచిత్రాలు చూసి చూసి విసిగిపోయిన మాకు 'పుష్పవికాసం' (30-6-78 తో వెలువడిన సంచిక మమ్మల్ని ఆనందడోలికల్లో ముంచి 'సిందంటే నమ్మండి' 'మోహనరూప' సీరియల్ మంచి ఇంటరెస్టుగా సాగిపోతుంది అయ్యో! 'వర్షం కురిసిన రాత్రి' సీరియల్ అప్పుడే అయిపోయిందా? '7-7-78' సంచిక నుండి ప్రారంభమయ్యే 'పద్మావతి పెళ్ళి' సీరియల్ కొరకు మంగళవారం ఎప్పుడొస్తుందా నని ఎదురు చూస్తుంటాము?

కాయితాపురం ఉపేందర్ రెడ్డి,
కళ్యాణం వెంకటయ్య (జనగామ)

* * *

పుష్పవికాసం ముఖచిత్రంగా వెలువడిన 30-6-78 ఆంధ్ర సచిత్ర వార పత్రిక చాల అందంగా ఉన్నది, చూడటకు ఎంతో ఆహ్లాదంగా ఉన్నది ఎప్పుడు సినిమా బొమ్మలే గాకుండా అప్పుడప్పుడు ఇలాంటి అందమైన డిజైన్స్ ముఖ చిత్రంగా వేస్తే బాగుంటుంది సరోజ కథ చాలా బాగుంది

పాలేటి వెంకట్రావు (తిక్కిరెడ్డిపాలెం)

* * *

అర్ధనగ్న చిత్రాలను పత్రిక ముఖచిత్రంగా చూసి చూసి విసుగు కలిగించిన మాకు పుష్ప వికాసం' ముఖచిత్రంగా వెలువడిన ఈ వారం (30-6-78) ఆంధ్ర సచిత్ర వార పత్రిక కొంత రిలీఫ్ కలిగించింది ముఖచిత్రాన్ని ఎంత సేపు తిలకించినా పదేపదే చూసి అమితానంద భరితుల మయ్యాము. అప్పుడప్పుడూ ఇలాంటి ముఖచిత్రాన్ని ప్రచురించి, పాఠక హృదయాలను ఆహ్లాదాన్ని కలుగజేస్తున్న పత్రిక వారికి మా థ్యాంక్సు.

కె.బి. హేమలత, కె.బి. సరళకుమారి,
యం. రామకృష్ణ, పులుసుగంటి శ్యామల.
(కుప్పం)

* * *

ప్రతివారం వేసిన ముఖచిత్రాలనే వేస్తూ, వేసిన సినీతారల ముఖచిత్రాలే చూసే మాకు ప్రకృతి సౌందర్యముతో ఎంతో అందంగా రంగు రంగుల్లో వేసిన 30-6-78 నాటి ముఖచిత్రం ఎంతో సంతోషాన్ని కలుగజేసింది మధ్య మధ్యలో ఇలాంటి అందమైన ప్రకృతి దృశ్యాలు ముఖచిత్రాలుగా వేయవలసిందిగా కోరుచున్నాము. 'పుష్పవికాసం' ముఖచిత్ర రచయిత అభినంద నీయుడు. పత్రికా ముఖంగా ధన్యవాదాలు తెలియ జేయండి.

బాచ శ్యామసుందరరావు (వెపులమద్ది)

(50 వ పేజీ చూడండి)

కనుకున్న ఫీలింగ్ స్పష్టంగా పలికిస్తున్నాడు గొంతులో. పాట సాగిపోతోంది.

"ఈ గాలి సల్లంగ తోయాల
మా పడవ ముందుకు సాగాల
మబ్బు తునకల్లా ముందుకు సాగి పోవాల
హైలెస్సా... హైలెస్సా...
ఇంటికాడ ఉన్న సిన్నది ఎదురుచూస్తా
ఉంటాది.
పడవలనిండా సేపలు సూసి పరవశమై
పోతాది
తెరసాపెత్తి పడవా రేవుకాడికి పోనీరా
మాపటేలకు మళ్లీ వచ్చి
సూసి కుంటమురా మన ఏట
కూటికోసమని గూటిని వదిలి
ఏటికాడికి వచ్చిన మమ్మ
సింహాద్రి అప్పన్న సల్లంగ సూడాల
కనకమాలచ్చిమ్మ కష్టాలు తీర్చాల...
... ... ... ... ... ...
ఈ గాలి సల్లంగ తోయాల...
హైలెస్సా... హైలో... హైలెస్సా..."

హరికృష్ణ పాడుతూంటే ప్రేక్షకులకి కూడా పడవలో వెళ్తున్న భావన కలిగింది. డ్యాన్స్ అయిపోయింది. ఆ తరువాత ఏవో పాటలు పాడారు. "సినిమా తీసి చూడు" అని హాస్యనాటిక వేసారు.

ప్రోగ్రాం అయిపోయింది. హాలు మెల్లిగా ఖాళీ అయింది. వాసు హరికృష్ణని తీసుకుని ప్రేమవైపు వచ్చాడు.

"హరీ! మీట్ మై కజిన్ సిస్టర్ మిస్. ప్రేమ. వుమెన్స్ కాలేజిలో కెమిస్ట్రీ లెక్చరర్‌గా పని చేస్తోంది. మీ జాతికి చెందిన శాల్తీయే. కొంచెం రచనలూ గట్రా చేస్తుంది. మంచి గాయకురాలు" వాసు పరిచయం చేసాడు.

"గ్లాడ్ టు మీట్ యు!" హరికృష్ణ చేతులు జోడించాడు.

ప్రేమ నవ్వుతూ చేతులు జోడించి పరిశీలనగా హరికృష్ణ మొహం వైపు చూసింది. [illegible] యింగా ఉన్న ఆ మొహంలో పసితనంలో కూడిన అమాయకత్వం కూడా కొలువుతీరి ఉంది. ఈ ప్రపంచంలోని కష్టాలు, ద్వేషాలు, అసూయలు వీటి జాడలతో సంబంధం లేనట్టుగా నిర్మలంగా ఉన్న కళ్లు తీక్షణంగా మెరుస్తున్నాయి.

ప్రేమ నవ్వుతూ అంది "ఏమ్మల్లి

కలుసుకోవాలని చాలా రోజుల నుంచి అనుకుంటున్నానండీ. మా వాసు ఎప్పుడూ మీ గురించి చెప్తూ ఉంటాడు. వాడి స్నేహితులు అందరూ మా ఇంటికి తరచు వస్తూ ఉంటారు కానీ మీరే ఎప్పుడూ రాలేదు. మీ దర్శన భాగ్యం మాకు కలిగించదలుచుకోలేదన్న మాట."

హరికృష్ణ నవ్వాడు. "భాగ్యమా? అంత పెద్ద మాటలనకండి నేను ఈ ప్రపంచంలో చాలా అల్ప జీవిని. నాకంటే వీళ్ళు అయిదారేళ్లు చిన్నవాళ్లు కదండీ. అందుకని నా మీద అంతంత గౌరవాలు అనవసరంగా పెంచుకున్నారు. అలాంటివి విని మీలాంటి అమాయకులంతా బోల్తా పడిపోతారు. మీరు అభిమానాన్ని, గౌరవాన్ని నాలాంటి వాళ్ళమీద గుమ్మరించి అపాత్ర దానం చెయ్యకండి ఇక మీ ఇంటికి రాలేదని అభాండం వేశారు కదా! నిరుద్యోగిని. ఉద్యోగాన్వేషణలో ఉన్నాను. పేరుకు లాయర్నే కాని ఒక్క రోజుకూడా కోర్టు మొహం చూడలేదు. ఒక్క కేసూ వాదించలేదు. మా సీనియర్ లాయర్ ఒకసారి ఏదో కేసు నిమిత్తం ఓ పల్లెటూరు పంపిస్తే నేను అక్కడి ప్రకృతి సౌందర్యానికి పరవశించి పోయి పాటలు రాసుకుంటూ కూర్చున్నాను. దాంతో ఆయనకి కోపంవచ్చి నేను ప్రాక్టీసు చెయ్యటానికి ఏంత మాత్రం పనికిరానని పెద్ద సర్టిఫికెట్ ఇచ్చి పర్మనెంట్‌గా పాటలు రాసుకోమని ఇంటికి తోలేశారు. అలాంటి సరుకిది. మరి ఈ నిరుద్యోగి పిల్లలతో కలిస్తే "అయ్యో! నా బంగారు ప్రాయం దాటిపోయిందే అని బాధ కలుగుతుంది. అయినా అప్పుడప్పుడూ పిల్లలతో కలిసి ఆ బంగారు క్షణాలు ఇలా అనుభవిస్తూ ఉంటాననుకోండి."

హరికృష్ణ ధోరణికి అందరికీ నవ్వు వచ్చింది.

వాసు అన్నాడు. "ఏమిటండీ! హరీ! అప్పుడే ముసలి వాళ్ళయిపోయినట్టు మాట్లాడుతున్నారు?"

"అవునయ్యా హరి! ముసలివాడిని కాక ఏముంది మరి! నేను సర్వీస్‌లో చేరటం రిటైరైపోవటం కూడా జరిగింది. ఇంకా చిన్నవాడినేమిటి?"

అతని మాటలకు అందరూ నవ్వారు.

"నాన్న స్కూటర్ తెచ్చినట్టున్నావుగా మోహన్? నన్ను దింపేస్తావా?" ప్రేమ అడిగింది.

"మహా ప్రసాదం! అంతకంటేనా!"

ప్రేమ హరికృష్ణ వైపు తిరిగింది. "మీరు ఒకసారి తప్పకుండా మా ఇంటికి రండి. నా ఆతిథ్యం స్వీకరించాలి."

హరికృష్ణ అంగీకరించాడు.

* * *

దారిలో వస్తూండగా మోహనని అడి



# అంతరిక్ష పరిశోధనలో సోవియట్ - భారత సహకారం

సోవియట్ పక్షం, తన భారతీయ సహచరుల పట్ల తన బాధ్యతలను, వాగ్దానాలను పూర్తిగా నెరవేర్చింది. ద్వితీయ భారతీయ ఉపగ్రహ ప్రయోగ సన్నాహాలు పూర్తికాగానే దానిని ప్రయోగించడానికి సిద్ధంగా వుంది, అని 'ఇంటర్ కాస్మోస్' కౌన్సిల్ డిప్యూటీ ఛైర్మన్ నికొలాయ్ నోవికోవ్ 'టాస్' విలేకరితో చెప్పారు. ఆయన బెంగుళూరులో జరిగిన సోవియట్--భారత ప్రవీణుల సంయుక్త సమావేశంలో పాల్గొన్న సోవియట్ ప్రతినిధి వర్గానికి జూన్ తొలి వారంలో నాయకత్వం వహించారు.

సోవియట్ వాహక రాకెట్‌తో ద్వితీయ భారతీయ ఉపగ్రహాన్ని ప్రయోగించడానికి సంబంధించిన అనేక విషయాలను ఈ సమావేశం నిర్దిష్టంగా చర్చించింది. ఈ ఉపగ్రహానికి సంబంధించిన సమస్త సాంకేతిక, ఇంజనీరింగ్ విషయాలను నిశ్చయించింది. ఉభయ దేశాల ప్రవీణుల మధ్య పరస్పరం పూర్తి అవగాహనా వాతావరణంలో వ్యవహార సరళిలో, స్నేహ సమావేశం జరిగిందని నికొలాయ్ నోవికోవ్ నొక్కి చెప్పారు.

1975 ఏప్రిల్‌లో సోవియట్ విజ్ఞాన శాస్త్ర పరిషత్తు, భారతీయ రోదసీ పరిశోధనా సంస్థల మధ్య జరిగిన ఒప్పందానికి అనుగుణ్యంగా ఉభయ దేశాల శాస్త్రవేత్తల మధ్య సహకారం కొనసాగుతూ వుందని ఆయన అన్నారు. భారతీయ రెండవ ఉపగ్రహం, మొదటి దానిలాగే సోవియట్ భూభాగం నుండి ప్రయోగించబడుతుంది. దాని బరువు 420 కిలోగ్రాములు వుంటుంది. అంతరిక్షం నుండి భూమి పరిశోధనలు సాగించడానికై ఈ ఉపగ్రహం రూపకల్పన చేయబడింది.

ప్రథమ భారతీయ ఉపగ్రహం 'ఆర్యభట్ట'ను ప్రయోగించిన విధంగానే సోవియట్ వాహక రాకెట్ ద్వారా ఈ రెండవ ఉపగ్రహాన్ని భూమికి 500 కిలో మీటర్ల ఎత్తున కక్ష్యలోకి ప్రవేశపెడుతుంది. ఈ ఉపగ్రహం ప్రయోగింపబడిన పిమ్మట తొలి దశలో దీనిని అజమాయిషీ చేయడానికీ, దాని నుండి సమాచారం అందుకోవడానికి సోవియట్ భూతల కేంద్రం 'బేర్ లేక్'ను భారతీయ ప్రవీణులు వినియోగించుకోవడానికి అనుమతింపడం జరుగుతుంది. ఇదంతా కూడా ప్రతిఫలాపేక్ష లేకుండా ఉచితంగానే సమకూర్చడం జరుగుతూ వుందని నికొలాయ్ నోవికోవ్ చెప్పారు.

---

గింది ప్రేమ. "హరికృష్ణగారు ఎక్కడుంటారు?

"జిల్లా పరిషత్ ఆఫీసు దగ్గర ఉంటారు. వాళ్ళ నాన్నగారు పెద్ద బిజినెస్ మాగ్నెట్ ఈ ఊళ్ళో."

ప్రేమ తెల్లబోయింది. "అలాగా! మరి ఆయనేంటి నిరుద్యోగినని అలా అంటారు?"

మోహన్ నవ్వాడు "అదా! ఊరికనే తమాషాకి హాస్యం చేస్తారు. ఆయనకి ఉద్యోగం ఎందుకు? మలాంటి వాళ్ళని పదిమందిని పోషిస్తారు. వాళ్ళ నాన్నగారికి ఒక్కడే అవటం వల్ల చాలా ముద్దు. అందుకని ఉద్యోగం చెయ్యమని అడిగేవారు లేరు. ఇలా కవిత్వాలూ, పాటలూ అంటూ తిరుగుతూ ఉంటాడు."

"అదృష్టవంతుడు! ఉన్న కళని ప్రోత్సహించే శక్తి అందరికీ ఉండదు." ప్రేమ దిగిపోయింది.

"అప్పుడప్పుడు రా, మోహన్" ప్రేమ ఆప్యాయంగా అంది.

"అలాగే! వస్తానక్కా" మోహన్ స్కూటర్ ఎక్కుకుని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి చాలా సేపటి వరకు హరికృష్ణ రూపం, పాట, గిటార్ వాయిద్యం ప్రేమను వెన్నాడుతూనే ఉన్నాయి.

## ప్రేమించు ముక్తికై

ఆ తరువాత చాలా రోజుల వరకు హరికృష్ణ మళ్ళీ కనిపించలేదు. ప్రేమ కూడా కాలేజ్ హడావిడిలో వాసుని కలవలేదు. కాని ఏ పని చేస్తున్నా, ఎక్కడ తిరుగుతున్నా అమాయకమైన హరికృష్ణ ముఖం, తీక్షణమైన ఆ చూపులు, చివరలో మెల్లిగా పాడినట్లుగా మృదువుగా ఉండే ఆ పాట అజ్ఞాతంగా ప్రేమ చుట్టూ తిరుగుతున్నట్టుగా అనిపించేది.

ఆ రోజు కాలేజిలో స్టాఫ్ మీటింగ్ అయ్యేసరికి సాయంత్రం 6-30 అయింది. ఇంగ్లీష్ లెక్చరర్ సుధారాణితో కలిసి ప్రేమ గేటు బయటికి వచ్చింది.

"హౌ విల్ యు గో? ప్రేమా?" సుధారాణి అడిగింది.

ప్రేమ ఒక్క క్షణం ఆలోచించింది. "ఈ టైములో బస్సులు చాలా రద్దీగా ఉంటాయి. నడవటమే బెస్టు పద! నడుద్దాం."

సుధారాణి బెంగాలీ. తెలుగు అసలు రాదు. ఆమె భర్త రైల్వేలో అసిస్టెంట్ ఇంజనీరుగా పని చేస్తున్నాడు. ఇంట్లో వంటవాడు, పనివాళ్ళూ, మందీ మార్బలం చాలా మంది ఉన్నారు. స్వతహాగా ఆస్తిపరులు. కాలక్షేపం లేక ఉద్యోగంలో చేరింది. ముక్కుకు సూటిగా పోయే మనస్తత్వం. అనవసరంగా ఇంకొకళ్ళ విషయం పట్టించుకోదు. ఎవరైనా అనవసరంగా తన జోలికి వస్తే సహించదు. ఆ కాలేజీలో ప్రేమ ఒక్కర్తే తన ధాటికి తట్టుకుని స్నేహితురాలిగా నిలబడగలిగింది. కాలక్షేపానికన్నట్టుగా మెల్లిగా నడుస్తూ లోకాభిరామాయణం మాట్లాడుకుంటూ సాగారు.

అవీ ఇవీ మాట్లాడుతున్న ప్రేమ విసురుగా లాపీగా అడుగులు లెక్క పెడుతున్నట్టుగా అటూ ఇటూ చూస్తూ ఎదురుగా వస్తున్న శాల్తీని చూసి చటుక్కున ఆగిపోయింది.

"హలో హరికృష్ణగారూ! ఎంత సుదినం! మళ్ళీ రాలేదు. వస్తానన్నారు." అతను కనపడిన ఆనందం అంతా కళ్ళల్లో ముఖంలో ప్రతిఫలిస్తుండగా అడిగింది ప్రేమ.

ప్రేమను చూడగానే హరికృష్ణ నాలిక్కరుచుకున్నాడు. అతను దాదాపు ప్రేమ ఆహ్వానాన్ని మరచిపోయాడు. అన్నిసార్లు ప్రేమ రమ్మని చెప్పినా వెళ్ళటం కుదరనేలేదు.

హరికృష్ణ నసుగుతూ బుర్ర గోక్కున్నాడు. "అబ్బే ఏమీ కారణం

లేదండీ రాకపోవటానికి! ఏమిటో తీరలేదు. దమ్మిడీ ఆదాయం లేదు. చేసే పనిలేదు. క్షణం తీరికలేదు అన్నట్టుంది నాసంగతి. సరేలెండి! నాసంగతికేం కాని మీరేమిటి! కాలేజ్ నుంచి వస్తున్నట్టుందిగా! ఇంతా లస్యం అయిందేమిటి?'' నడిచి వస్తున్నారేం?...ఆరోగ్యసాధనా!

''అన్ని ప్రశ్నలూ ఒక్కసారే వేస్తే ఎలాగండీ బాబూ! మీలాగా నేనేమన్నా కవినా. చెప్పండి ఒకే మాటలో అన్నీ జవాబులూ చెప్పటానికి? అన్నట్టు మీట్ మై కొలీగ్ అండ్ మై క్లోజ్ ఫ్రెండ్ మిసెస్ సుధారాణి. సుధా! ఈయన హరికృష్ణ. మంచి కవి, గాయకుడు. గిటార్ చాలా బాగా వాయిస్తారు.'' అంది ప్రేమ ఇద్దరికీ పరిచయం చేస్తూ.

సుధారాణి మర్యాదగా నమస్కరించి, చేతులు జోడించింది.

''ప్రేమా! నేను వెళ్ళిపోతాను. నీకు కంపెనీ లేదు కదా అని నడిచి బయలు దేరాను. నాకు క్లబ్‌లో చిన్న ఫంక్షనుంది'' అంది సుధారాణి మొహమాటంగా హరికృష్ణ వైపు చూస్తూ.

హరికృష్ణతో ఏకాంతం కోరుకున్న ప్రేమ వెంటనే సరేనంది. సుధారాణి గిర్రున మీద వెళ్ళిపోయింది.

ప్రేమ హరికృష్ణ వైపు తిరిగింది.

''ఇప్పుడు చెప్పండి కబుర్లు'' ఈ మధ్య పాటలేమన్నా రాసారా?''

హరికృష్ణ పెదవులమీద చిరునవ్వు కదిలింది ''నన్ను చూడగానే నేను కాక నాలో ఉన్న కవే జ్ఞాపకం వస్తాడు కాబోలు అందరికీ. ఎవరు పలకరించినా పాటలేమన్నా రాసారా? అనే అడుగుతారు కాని మీరెలా ఉన్నారు? అని అడగరు.''

ప్రేమ నవ్వింది ''చూసారా? అయితే ప్రపంచంలో ఎంత మంది కళోపాసకు లున్నారో! మిమ్మల్ని చూడగనే మరి కవి హరికృష్ణే జ్ఞాపకం వస్తారు. మామూలు మనుష్యుల్ని మామూలుగా గుర్తిస్తాం కాని, అసాధారణ వ్యక్తుల్ని అసాధారణంగానే చూస్తాం మరి. పోనీ ఇప్పుడు చెప్పండి, అడుగుతున్నాను. ఎలా ఉన్నారండీ హరికృష్ణగారూ!'' ప్రేమ స్వరంలో కొంటెతనం పూర్తిగా నిండి వుంది.

హరికృష్ణ మూతి ముడుచుకున్నాడు;

''చూశారా! నేనంటే వేళాకోళంగా ఉంది మీకు?''

''లేదండీ బాబూ! మీరు అడగమన్న విధంగా అడిగినా కోపమేనా? నన్నొక్కటి చెప్పమన్నారా! గొప్పగా గుర్తింప బడటం ఇష్టంలేక గులాబీ వెళ్ళి గడ్డి పువ్వుల్లో దాగినా గులాబీని గులాబీగానే గుర్తిస్తారు. మీరు సాధారణంగా ఉందామన్నా ఉండలేరు. మీలోని 'కవి' అలా ఉండనివ్వడు కనక ఆ ప్రయత్నం మానెయ్యండి. ఏమిటి ఈ మధ్యంతా ఎక్కడా కనిపించటం లేదు? మీ ప్రోగ్రాములు ఏమీ లేవా? ఈ మధ్య?''

''లేదండీ! నే చెప్పలేదూ ప్రోగ్రాం ఇవ్వను మొన్ననే వచ్చాను కలకత్తా నుండి. వచ్చిన దగ్గర నుండీ వాసుని కలుద్దామను కుంటున్నాను ఆ రోజు వాడే బలవంతంగా ప్రోగ్రాం ఇప్పించాడు. అదృష్టం బాగుండ బట్టి రాళ్ళూ చెప్పులూ పడలేదు'' హరికృష్ణ వినయంగా అన్నాడు.

ఆ చల్లని సాయంత్రం వేళ హాయిగా వేడి తీరుస్తున్నట్టుగా ఉన్న వాతావరణంలో హరికృష్ణతో వంటరిగా నడవటం ప్రేమకు వింతో సంతోషంగా సంతృప్తిగా అనిపించింది. ఆ సాయంత్రం సుదీర్ఘమై శాశ్వతమై ఎప్పటికీ జీవిత మంతా అలా నడుస్తూ ఉంటే బావుండనిపించింది. అంత అదృష్టం పడుతుందా? ఎప్పటికయినా?...

''ఇక సెలవు పుచ్చుకుంటానండీ! వస్తాను.'' హరికృష్ణ చేతులు జోడించి వినయంగా అన్నాడు నడుస్తున్న వాళ్ళూ ఆగిపోయి.

ప్రేమ తెల్లబోయింది. ''అదేమిటండీ! అంత హఠాత్తుగా వెళ్ళిపోతా నంటు న్నారు?''

''ఎందుకండీ! మీరు నా మాటలైనా వినిపించుకోకుండా ఆలోచించేస్తున్నారు. ఎనర్జీ చాలా విలువైనది. ఉత్తినే మాట్లాడి ఎందుకు వేస్టు చేసుకోవాలి? వెళ్ళొస్తా'' హరికృష్ణ కోపంగా అన్నాడు.

ప్రేమ ఊపిరి పీల్చుకుంది. ''భలే వారండీ! వింటున్నానండీ బాబూ మీ మాటలు. చెప్పండి. అంతలోకే కోపమయితే ఎలాగ?''

''ఇప్పటికి మూడుసార్లడిగాను మీ ఇల్లెక్కడ? అని. జవాబు చెప్పేనా? ఎవరబ్బా అంతగా మీ ఆలోచనల్ని దోచుకున్న ఆ అదృష్టవంతుడు?''

మెల్లిగా తల తిప్పి అతని కళ్ళల్లోకి చూసింది ప్రేమ. ''మీరే!''

సూటిగా ఉన్న ఆ సమాధానానికి అతను తడబడ్డాడు. అతను సమాధానం చెప్పేలోగా ప్రేమ ఓ ఇంటిలోకి దారి తీసింది. తాళం తీసి ''లోపలికి రండి'' అంది.

హరికృష్ణ మొహమాటంగా చూసాడు. ''ప్లీజ్ ఇవాల్టికి వదిలేయండి. ఈసారెప్పుడైనా...''

''బాగుంది. ఇంటిముందర మంచి ఇవాళ జారుకుని ఎప్పుడో వస్తారన్నమాట



# ప్రేమించు ముక్తికై

"రేపు లేదోయి... ఈరోజు నీదోయి..." అన్నది నా పాలసీ. రండి లోపలికి. మిమ్మల్ని కట్టిపడెయ్యను. త్వరలోనే పంపిస్తాను." ప్రేమ బలవంతం చేసింది.

ప్రేమ మాటల్లోని బలవంతం కన్నా దాని వెనుక నున్న ఆప్యాయతకు లొంగి పోయాడు హరికృష్ణ.

"అబ్బ! ఎంత బావుందండీ మీ రూం. చాలా నీట్‌గా పెట్టారు. నా రూంచూస్తే భూతాల గృహంలా చుట్టూ కాగితాలతో ఉంటుంది. ఎప్పుడెప్పుడు బయట పడదామా అనిపిస్తూ ఉంటుంది. మా ఇంట్లో దాన్ని సర్దే ఓపిక ఎవరికీ లేదు. నిజంగా మీ రూం స్వర్గంలా ఉందంటే నమ్మండి నా కళ్ళకి." అన్నాడు హరికృష్ణ మెచ్చుకుంటూ.

"బావుందండీ. ఆడదాన్ని కదా! ఆ మాత్రం జన్మ సార్థకత ఉండద్దా? ఒక్క క్షణం ఒంటరిగా కూర్చోండి. మంచి కాఫీ తీసుకొస్తాను" అంది ప్రేమ లోపలికెళ్తూ.

ప్రేమ కాఫీ తెచ్చేసరికి టేబుల్ మీద సగం వేస్తూ వదిలేసిన రాధాకృష్ణుల పెయింటింగ్ గమనిస్తున్నాడు హరికృష్ణ.

అడుగుల చప్పుడుకి వెనక్కి తిరిగి చూసాడు. "ఇంత అద్భుతంగా పెయింట్ చేస్తారని నాకు తెలీదే? చాలా బావుంది బొమ్మ. చాలా నేచురల్‌గా ఉంది" అన్నాడు.

ఒక చెట్టు నానుకుని కాలుమీద కాలు వేసుకుని కూర్చుని మురళి వాయిస్తున్న కృష్ణుడు! అతనికి చేరువగా రెండు చేతులూ కింద ఆనించి, ఆ వాయిద్యానికి పరవశమైనట్టుగా అరమోడ్పు కన్నులతో తాదాత్మ్యం చెందిన రాధ! రాధ కళ్ళల్లోని ఆరాధన చాలా సజీవంగా ఉంది.

ప్రేమ ఆ చిత్రాన్ని పరిశీలనగా చూస్తున్నదల్లా అంది. "నాకు రాధా మాధవులంటే చెప్పలేనంత ఇష్టం. నా పెయింటింగ్స్‌లో చాలా మటుకు వాళ్ళవే."

హరికృష్ణ అడిగాడు, "ఎందుకంత ఇష్టం రాధ అంటే? సత్యభామ ప్రేమ కంటే ఎక్కువా? కృష్ణుడు మరెవ్వరికీ దక్కరాదన్నంత ప్రేమ సత్యభామకి. రుక్మిణి భక్తి కంటే గొప్పదా రాధ ప్రేమ?"

"రాధ ప్రేమ నిస్వార్థమైనది. నిష్కల్మషమైనది. నిర్మలమైనది. సత్యభామ కన్నా, రుక్మిణికన్నా విలక్షణమైనది రాధ ఆరాధన. అది ప్రేమ కాదు. ఆరాధన. అంతే. అందులో అసూయకి తావులేదు. కృష్ణుడే తాను తానే కృష్ణుడు అన్నంత గొప్ప ఆరాధన. సత్యభామ, రుక్మిణి కృష్ణుడిని పెళ్ళి చేసుకున్నారు. వాళ్ళు ప్రేమించినా ఆశ్చర్యం లేదు కాని రాధ ఆరాధనలోనే కృష్ణుడి సాన్నిహిత్యం పొంద గలిగింది."

హరికృష్ణ ప్రేమవైపు తిరిగాడు. "నా అభిప్రాయం వింటారా? వీళ్ళంతా-అంటే రాధ, సత్యభామ, రుక్మిణి వీళ్ళంతా కృష్ణుడిని కళ్ళతో చూసి ప్రేమించారు. అతని రూపం అలాంటిది. కాని మీరాబాయి?...ఆవిడ కొన్ని యుగాల తరువాత చరిత్రలు మారాకకూడా కృష్ణుడి రూపాన్ని ఊహించి ఆ ఊహా మూర్తిని సజీవంగా నిలుపుకుని ఆరాధించింది. రాధకెంత ఆరాధన ఉందో, అంతకు మించి ప్రేమించింది మీరా! సృష్టిలో నున్న 'పురుషుడు' ఒక్క కృష్ణుడే అన్నంత ఉన్నతమైన ఆరాధన! అందుకే నాకు రాధ కంటే మీరాబాయిఅంటే ఎక్కువ ఇష్టం."

అతను చేసిన విమర్శ ప్రేమకు ఆశ్చర్యం కలిగించింది. మౌనంగా ఊరుకుంది.

మళ్ళీ హరికృష్ణే అన్నాడు, "మీరు మీరా భజన్లన్నీ వినే ఉంటారు. అందులో దెంత ఆరాధన! గుండెల్ని స్పృశించినట్టుగా, మనస్సుని తాకినట్టుగా ఉండే ఆ భావం, ఆ భక్తి తత్పరత మనకి ఏ పాటల్లోనూ కనిపించదు. ఆ ఆరాధన సమున్నతమైనది. నాకు అప్పుడప్పుడూ అనిపిస్తూ ఉంటుంది కదా! ప్రతి భాషలోనూ కూడా ఆ భజన్లన్నీ వస్తే ఎంత బావుంటుంది! అందుకు ప్రసిద్ధి చెందిన ఈ కవులంతా ఎందుకు ప్రయత్నించరా అని పిస్తుంది. మన భాషలోని తీయదనం, తెలుగుభాషలోని సోయగం అద్భుతమైనవి. ఇంత అమృతం కురిసే మనభాషలో మీరా భజన్లు ఇంకెంత మధురంగా ఉంటాయో కదా! అని ఊహిస్తూ ఉంటాను." అతని మాటల్లోని బాధకు మీరాపట్ల అతనికున్న సద్భావానికి ప్రేమ కరిగింది.

ప్రేమ అంది, "మీరు కవులు కదా! ఆ

## లక్ష్మీదేవి భార్గవి ఎలా అయింది? — ధ ర్మ ప థం — బులుసు వేంకటరమణయ్య

లక్ష్మీదేవికి 'భార్గవి' అని పేరు కూడా ఉన్నది. భార్గవి అంటే భృగు పుత్రిక. ఆమె భృగు పుత్రిక అగుటకు ఒక ఇతిహాసం తెలుపుతూ ఉన్నది.

త్రిమూర్తులలో ఎవరు గొప్ప? అని ఋషులకు ఒక సందేహం కలిగింది. ఎవరు గొప్ప శాంతమూర్తియో అతనే అధికుడని ఒక సిద్ధాంతానికి వచ్చి, త్రిమూర్తులను పరీక్షించి నిర్ణయించడానికి భృగుమహర్షిని పంపారు.

మహర్షి సత్యలోకానికి పోయి బ్రహ్మను చూచి, ఆయనకు కోపం తెప్పించడానికి "స్వామీ! నీవు సృష్టి కర్తవు. నీవు సృష్టిచేసిన - సరస్వతీదేవి నీ పుత్రిక. ఆమెను నీవు వివాహమాడడం ధర్మమేనా?" అని అన్నాడు. బ్రహ్మదేవునికి విపరీతంగా కోపం వచ్చింది. అగ్నిజ్వాలలు ప్రసరించే ఆ చూపులను సహించలేక భృగువు పరుగెత్తి పారిపోయి, తర్వాత కైలాసానికి వచ్చాడు. అక్కడ మహేశ్వరుణ్ణి చూచి "దేవా! నీవు బొబ్బులింగడివి. ఎవరు పొగడినా లొంగిపోతావు. అందరికీ లొంగిపోయిన నీవు పార్వతీదేవికి లొంగిపోయి అర్ధనారీశ్వరుడవు కావడం బాగానే ఉన్నది" అని వ్యంగ్యంగా ఆక్షేపిస్తూ అన్నాడు. శివుడు దీనిని గ్రహించాడు. భృగువుపై కోపించి మూడవ కన్ను తెరవడానికి సంసిద్ధుడయ్యాడు. భృగువు రెప్పపాటు కాలమయినా అక్కడ ఉండక పలాయనం చిత్తగించాడు.

తర్వాత మహర్షి వైకుంఠం చేరుకున్నాడు. ఈయన వెళ్ళేసరికి మహావిష్ణువు యోగనిద్రలో ఉన్నాడు. "ఏమయ్యా! జనార్దన దేవా! జనుల నందర్నీ రక్షిస్తూ, జాగరూకుడవై ఉండవలసిన నీవు నిద్రపోతే ఎలాగ?" అని అంటూ ఆయన వక్షాన్ని కాలితో తన్నాడు. విష్ణువు మేలుకొని తన తప్పు క్షమించాలంటూ అతనికాళ్ళు పిసికాడు. దేవుని శాంత స్వభావానికి మెచ్చుకొని, ఆయననే గొప్పవాడని ఆముని నిర్ణయించి, మునులందర్నీ ఒప్పించాడు. పరీక్ష కోసం యిలా చెయ్యవలసి వచ్చిందనీ, క్షమించాలనీ త్రిమూర్తులనూ ప్రార్థించాడు.

లక్ష్మీదేవి విష్ణువు వక్షంపై ఉండడం వల్ల మహాముని కాలిదెబ్బ ఆమెకు తగిలింది అది మహాపరాధం. మహాపాపం! భృగువు ఆమె కాళ్ళపైపడి "అమ్మా! నిన్ను తన్నిన పాపాన్ని పోగొట్టుకోడానికి, తిరిగి నీవు నన్ను తన్నాలి. "నేను తన్నను" అంటావేమో! నీవు నాకు పుత్రికవై పుడితే నీ పతితనంలో నీచేత ఒకటి కాదు— రెండో తన్నులు తినగలను. ఇలా అనుగ్రహించు" అని ప్రార్థించాడు. లక్ష్మీదేవి చిరునవ్వు నవ్వుతూ దానికి సమ్మతించింది.

భృగుమహర్షికి పుత్రికగా పుట్టడంవల్లనే లోకజనని అయిన లక్ష్మీదేవికి "భార్గవి" అనే పేరు వచ్చింది.

---

పని మీరే ఎందుకు చేయకూడదు?"

"నేనేం కవినండీ బాబూ! అంత ధైర్యంగా నేను కవిని అని చెప్పగల సమర్థత నాకులేదు. నాకు రాయాలన్న ఉత్సాహం అయితే ఉంది కాని భాషలో పెద్దగా ప్రవేశం లేదు. కొన్ని కొన్ని పదాలకయితే సరియైన అర్థాలు కూడా నాకు తెలీదు. అందుకే నేను పెద్ద పెద్ద వాళ్ళ దగ్గర నోరు మెదపను. అయినా నేను మీరాబాయిని దృష్టిలో పెట్టుకుని ఓ పాట రాసాను. ఆఫ్‌కోర్స్, మీరా భజన్ స్థాయికి చేరుకోదనుకోండి. అయినా ఉత్సాహం కొద్దీ రాసాను. వింటారా?... అన్నాడు హరికృష్ణ గొంతు సవరించుకుంటూ.

అతను పాడుతున్నాడు, కళ్ళు మూసుకుని!

నిన్నే పిలిచేను నే నిన్నే పిలిచేను.

నిన్నె నిన్నె పలిచేను... నిన్నే పిలిచేను.

"గేయం అసంపూర్తిగా ఉందనుకుంటాను" ప్రేమ అడిగింది అంతా విన్నాక.

"అవుననుకోండి. మధ్య మధ్యలో కూడా ఇంకా రాయాలి. ఇది నా ప్రయత్నం మాత్రమే. అసలు ఎలా ఉందంటారు?"

"వింటానికి బాగానే ఉందనుకోండి. కానీ ... ఏమిటో హిందీలో ఉన్నంత ఎఫెక్టివ్‌గా...ఒరిజనల్‌గా లేదండీ" ప్రేమ నసుగుతూ అంది.

"నేను ముందే చెప్పాను కదండీ! నాకు ముఖ్యంగా భాషలో కమాండ్ లేదు. అందుకే నేను బాధ పడుతూ ఉంటాను మన పెద్ద పెద్ద కవులు ఆ ప్రయత్నం చేస్తే బావుండని..."

"సాధనమున పనులు సమకూరు ధరలోన...అన్నారు కదండీ. ప్రయత్నించి చూడండి. ఎవరో చేయలేదని బాధ పడేకన్నా... ఆ స్థాయికి ఎదగటానికి మీరే ప్రయత్నించండి." ప్రేమ ఉత్సాహంగా అంది. ప్రోత్సహించే ధోరణిలో.

ఒకసారి ప్రేమ వంక చూసి మౌనంగా ఊరుకున్నాడు హరికృష్ణ.

"మీ పాటలకు మ్యూజిక్ కూడా మీరే కూరుస్తారనుకుంటాను. మీకు సంగీతంలో ప్రవేశం ఉందా?" కుతూహలంగా అడిగిందిప్రేమ.

"లేదండీ. సంగీతంలో స-ప-సాలు కూడా నాకు తెలీవు. మా పెద్దన్నయ్య మంచి సంగీత విద్వాంసుడు. నాకు పాటలు రాయటంలో గల ఆసక్తి గమనించి చిన్నప్పుడు నన్ను కూర్చోబెట్టి కొన్ని ముఖ్యమయిన రాగాల పేర్లు— ఆ రాగాల్లో వచ్చే స్వరాలు మొదలయినవి చెప్పాడు. ఆ జ్ఞానాన్ని మించి నాకు ఏమీ తెలీదు. నా పాటకు సాధారణంగా వాడే మ్యూజిక్ సమకూర్చేస్తాడు."

"మీరు జనరల్‌గా ఏ సబ్జక్ట్స్ మీద రాస్తారు?"

"ఏమిటండోయ్! పత్రికా విలేఖరి లాగా అడుగుతున్నారు ప్రశ్నలు. నా పాటకు ఓ సబ్జక్ట్ అంటూ రిస్ట్రిక్షన్ లేదండీ. ఏదయినా సరే! రాసే టైముకి ఏ భావం మనస్సులో కదలితే అది. విరహగీతాలూ ప్రేమగీతాలూ... ఎక్కువగా జానపద గీతాలంటే నా ఇష్టం."

"మీకు అభ్యంతరం లేకపోతే మీరు రాసిన పాటలు నాకివ్వగలరా?"

( ఇంకాఉంది )

# టీచర్ ఉద్యోగాలైనా స్త్రీలకి కేటాయించాలి !

ప్రగతి భేరీ మ్రోగుతుందట. ప్రగతి పుష్పం వికసించిందట. ప్రగతిఫలితాలు అందరికీ సమంగా దక్కినపుడే ఆ ప్రగతి సౌభాగ్య పథంవైపు పయనించినట్లు.

వెనుకబడ్డ జాతులు, కులాలు, రిజర్వేషన్లు, మహిళా సంఘాలు, మహిళా మహాసభలు, అభివృద్ధి ప్రగతి అంటూ ప్రచార సాధనాలన్నీ పెట్టేగోల నిత్యమూ వింటూనే ఉన్నాము.

ఇప్పటి సంధియుగ సమాజమే 'స్త్రీ'ని పగబట్టిన పామై కాటు వేస్తుంటే పాలకులూ ఆ పాముకే పాలు పోస్తున్నారు.

ఈ కాల ప్రవాహంలో కొట్టుమిట్టాడుతూ నిలదొక్కుకొని బ్రతకాలనే తపనతో సతమతమయ్యే ఒక విద్యాధికురాలిగాథయిది. యదార్థ సంఘటనల కథ.

గుంటూరు జిల్లాలో మధ్య తరగతి రైతు కుటుంబమందు పెద్ద బిడ్డగా పుట్టింది. జీవిత ఒడుదుడుకులలో ఆ కుటుంబము నిరుపేద కుటుంబానికే దిగువ స్థాయికి జారిపోయింది. అయినా సర్వమూ వడ్డి ఇంగ్లీషులో పి. యు. సి. వరకు చదివిందా అమ్మాయి. తర్వాత మెరిట్ స్కాలర్‌షిప్‌తో అయిదు సంవత్సరాలు తెలుగు, సంస్కృతములందు "భాషా—ప్రవీణ" ఉత్తీర్ణురాలై తెలుగు పండిట్‌గా అన్ని అర్హతలు పొందింది.

తల్లి, దండ్రి, అమ్మమ్మ, తమ్ముడు, చెల్లెలు, తాను కలిసి ఆర్గురున్నారు. వీరి జీవనాధారం వారి మంచితనమే. తల్లి దండ్రుల బంధువులో, మిత్రులో ఆధారం వీరందరికీ.

ఇన్ని యాతనలు పడుతున్నా చిన్న పిల్లల నిద్దర్ని హైస్కూలుకు పంపుతూనే వున్నారు. తల్లి దండ్రుల అనారోగ్య కారణంగా ఏ పనికీ అర్హులు కారు. ఆరుగురి జీవన యాత్ర, ఇద్దరి పిల్లల చదువులూ అసాధ్యమై పోతున్నా దిక్కు లేదు.

ఈ పరిస్థితి నుండి బయటపడి ఒకరికి చేయి చాపకుండా జీవిద్దామనీ, కుటుంబ భారాన్ని తలకెత్తుకుందామనీ చదువుపూర్తి చేసిన అమ్మాయి సిద్ధమైంది.

1973 లో జిల్లా ఎంప్లాయిమెంటు ఆఫీసులో తెలుగు పండిట్ ఉద్యోగానికి పేరు రిజిష్టరు చేసుకొంది. వాన్టెడ్ కాలమ్సులోని ఎన్నో ఉద్యోగాలకు అప్లికేషన్సు పెట్టింది. పిలిచినఇంటరువ్యూల కెన్నింటికో వెళ్ళింది. పిలవని ప్రయివేటు ఆఫీసుల చుట్టూ తిరిగింది. ప్రతిచోటా శూన్య హస్తమే ఎదురైంది.

పలుకుబడి, రికమెండేషను, డబ్బు ఉంటే ఏ పనయినా వడ్డించిన విస్తరిలా ఉంటుంది. చేతిలో వంద ఓట్లయినా ఉంటే ఏ పనయినా సాధించవచ్చు. ఇవేమీ లేక కేవలం అర్హతలతోనే ఉద్యోగం సాధిద్దామంటే అందులో ఒక ఆడదానికి సాధ్యం కాదు.

ఈ పరిస్థితుల్లోనే యీ అమ్మాయికి పెండ్లి అయిందనిపించారు. అప్పటి వరకు ఏదో చిన్నపని చేసుకుంటున్న ఆమె భర్తకీ ఆ పనికూడా ఊడింది. ఆరుగురల్లా ఏడుగురయ్యారు.

అదే సమయంలో 1974 లో జిల్లా పరిషత్‌కి తెలుగుపండిట్ పోస్టుకి ఇంటరువ్యూకెళ్ళింది పరిషత్ ఇంటరువ్యూలు



వాసిరెడ్డి ఝాన్సీరాణి

ఒకసార్సి అయిదురూపాయలు కట్టిన వారినందర్నీ ఇంటరువ్యూకి పిలుస్తారు వెయిటింగ్ లిష్టులో నయినా తనపేరు చేరుస్తారేమో నని చూశారు. అదీ నిరాశే అయింది.

1976 లో మరలఖాళీలు ప్రకటించారు పరిషత్ వా. నవంబరు 25న ఇంటరువ్యూకి రమ్మన్నారు. ఈ ఇంటరువ్యూ యీ అమ్మాయికి జీవన్మరణ సమస్య అయింది. ఆ నెలలో మూడు తుఫానులు వచ్చి ఆంధ్ర ప్రజల్ని భీతావహుల్ని చేసిన రోజులవి.

అదే నెల 21న క్రిష్ణాజిల్లా గుడివాడలో తన బంధువుల యింట ప్రవసించేవున్నది అమ్మాయి. 25 న ఐనా యీ అమ్మాయి గుడివాడనుండి గుంటూరుకి ఇంటరువ్యూ కెళ్ళాలి.

ప్రాణంమీద తీపి పోవద్దంటుంటే పరిస్థితుల వత్తిడికి తట్టుకోలేక ఆ రోజే ఆరంభమయిన మూడవ తుఫాను వర్షంలో అయిదింటికే బయలుదేరి మధ్యాహ్నం పన్నెండింటికి గుంటూరు చేరింది.

చెప్పిన టైంకి గాక ఆలస్యంగా ప్రారంభించిన హిందీ పండిట్ల ఇంటరువ్యూ రాత్రి ఏడింటికి పూర్తయింది తెలుగు పండిట్లని అరగంటలో చాలా మందిని ఇంటరువ్యూ అయిందనిపించి ఎనిమిదింటికి వెళ్ళమన్నారు. తన దీన గాథ అధికార్లకు విన్నవిద్దామన్నా అవకాశమే లేదు.

తీవ్రస్థాయి నందుకున్న ఆ తుఫానులో తడుస్తూనే స్టేషను జేరితే ఆ రాత్రికి బండి లేదన్నారు ఆ రాత్రంతా యమ బాధతో జాగారంచేసి తెల్లవారి ఆరు గంటలకు తన పసిగుడ్డు దగ్గరకు జేరుకొంది. ఇంతాచేస్తే ఫలితం శూన్యం.

ఆర్థిక సామాజిక అభివృద్ధిలో స్త్రీలు సరిసమంగా పాల్గొనాలని చెప్పే మాటలకి ఇదేనా మార్గం! అందుకని కనీసం "ఉపాధ్యాయిని" ఉద్యోగాలైనా స్త్రీలకు కేటాయించాలి.

# మీకు భయం కలిగించేలా మీ బిడ్డ తరచుగా జబ్బు పడుతూ ఉన్నట్టయితే మీరు ఈ ప్రకటన తప్పనిసరిగా చదవాల్సిందే. నీటిద్వారా వచ్చే జబ్బులనుంచి మీ బిడ్డనెలా కాపాడుకోవాలో ఇది మీకు చెప్తుంది.

పెరిగే బిడ్డ తల్లిదండ్రులుగా మీ మనస్సులో ఉదయించే మొదటి ప్రశ్న: అలా చేయడం మనుష్యుల తరమేనా, అని. త్రాగే నీటిని శ్రమపడి మరిగించినా కూడా, పిల్లలకు నీటి జబ్బులెలా వస్తాయా అని ఆశ్చర్యపడుతున్నారా? అవును, నమ్మశక్యంగా ఉండదు, కాని అది నిజమే. ఉదాహరణకు, 1977 మే 4వ తేదీ టైమ్స్ ఆఫ్ ఇండియా దిన పత్రికలో పడిన ఈ వార్త చూడండి: "నీటి జబ్బుల ద్వారా మరణిస్తున్న పిల్లల సంఖ్య ఖచ్చితంగా తెలియకపోయినా, ఐదేళ్ల లోపు పిల్లలు జనాభాలో 17 శాతం ఉన్నారనీ, ఏటా సంభవించే మరణాల్లో వీరిది 40 శాతం అనీ రూఢిగా తెలియవస్తోంది.

# మీ పిల్లలకు హాని కలిగించేవి ఇన్ని అన్ని కావు!

## నీటిని కేవలం మరిగిస్తే చాలదని శాస్త్రీయంగా నిర్ధారించ బడింది.

నీటిని మరిగించడం ఒక్కటే ఏంతమాత్రం సరిపోదని ఇప్పుడు నిర్ధారించబడింది. మరిగించడం వల్ల క్రిములు మాత్రమే నశిస్తాయి, కాని వాటి 'స్పోర్స్' మాత్రం కాదు. మీకు కావలసినది ఈ రెంటినీ తొలగించేది. ఎందుకంటే ఈ 'స్పోర్స్' అనేవి నీటిలో ఉండే సూక్ష్మ జీవుల యొక్క నిద్రావస్థ మాత్రమే. 100°డి (నీరు మరిగే) ఉష్ణోగ్రతలో కూడా వీటికి ఏ హానీ కలగదనే చెప్పాలి. మరిగించిన కొద్ది గంటల తర్వాత అవి మళ్లీ తమ పని ప్రారంభించి మరిగించిన నీటిని కలుషితం చేస్తాయి.

## మట్టి కుండలు ప్రమాదం!

ఏ కాస్త్రజ్ఞుడినైనా అడగండి. మరిగించిన నీటినైనా సరే, మట్టి కుండలో ఉంచినట్టయితే ప్రమాదమే అని చెప్తారు. ఎందుకంటే, మట్టి కుండకు ఉండే అసంఖ్యాకమైన సూక్ష్మ రంధ్రాల్లో క్రిములు కూడా అసంఖ్యాకంగా పెరుగుతాయి. అంతెందుకు, స్వచ్ఛంగా కనబడే నీటిని కూడా మైక్రోస్కోప్ క్రింద పరీక్షించినట్లయితే సూక్ష్మ జీవులు కనిపిస్తాయి. వీటివల్లే కలరా, టైఫాయిడ్, సులిగడుపు, పచ్చ కామెర్లు, గాస్ట్రో-ఎంటరైటిస్ వంటి భయంకరమైన వ్యాధులు వస్తాయి.

## దీనికి విరుగుడు ఏమిటి?

భయపడకండి! సమస్య తీవ్రమైనదే అయినా, దానికి విరుగుడు మాత్రం తేలికే. దేశం అంతటా తెలివైన తల్లిదండ్రులు ఉపయోగిస్తున్నది ప్యూరిటాస్ వాటర్ ఫిల్టర్. పక్కనే ఉన్న బొమ్మలో చూపినట్లుగా, ఈ ఫిల్టర్‌లో రెండు అరలు, క్యాండిల్స్, ఒక కొళాయి ఉంటాయి. పై అరలో నింపే నీరు నెమ్మదిగా, చక్కగా క్యాండిల్స్ ద్వారా వడపోయబడి క్రింది అరలో జమ అవుతుంది.



## క్యాండిల్స్ రహస్యం.

రహస్యం అంతా ప్యూరిటాస్ క్యాండిల్స్ లోనే ఉంది. ఇటువంటివి భారతదేశంలో ఇదే ప్రథమం. ప్యూరిటాస్ క్యాండిల్స్, మునిసిపల్ ముఖ్య అధికారుల ద్వారా లాబొరేటరీలో పరీక్షించబడి ఆమోదించబడినవి. ఈ క్యాండిల్స్ 'కీసెల్‌గర్' అనబడే ఒక ప్రత్యేకమైన మట్టితో తయారవుతాయి. దీనిలో అతి సూక్ష్మ రంధ్రాలు ఉండటం వల్ల ఇది అదర్శవంతమైన ఫిల్టర్‌గా తోడ్పడింది. ఇది సూక్ష్మ జీవులనూ, వాటి 'స్పోర్స్'నూ పూర్తిగా తడకట్టి, క్రింది అరలో 100% స్వచ్ఛమైన త్రాగే నీటిని మీకందిస్తుంది.

## ప్యూరిటాస్ 100% స్వచ్ఛమైన నీటిని ఇస్తుందని ఋజువు?

మా వద్ద ఋజువు ఉంది. మీరు భారత దేశంలోని మా కార్యాలయాలలో దేనికైనా వచ్చి లేబొరేటరీ పరీక్ష నివేదికల యొక్క ఫొటోస్టాట్ కాపీలను తనిఖీ చేయవచ్చు. బొంబాయిలోని మా ప్రధాన కార్యాలయంలో గల అసలైన పత్రాలను కూడా చూడవచ్చు. ప్యూరిటాస్ వాటర్ ఫిల్టర్ సూక్ష్మ జీవులను సమూలంగా తొలగిస్తుందనే దాంట్లో ఏమాత్రం సందేహం లేదని నిరూపిస్తాయి ఈ నివేదికలు. మీరు క్రిములు గాని, వాటి 'స్పోర్స్' గాని లేనట్టి 100% స్వచ్ఛమైన నీరు లభిస్తుందనడానికి ఇదే హామీ. అంతే మీ పెరిగే పిల్లలకూ, మీకూ 100% సురక్షితం.

## హెచ్చరిక:

మీ స్వంత భద్రత కోసం మీరు అసలైన ప్యూరిటాస్ ఫిల్టర్ మాత్రమే కొంటున్నారన్నది నిర్ధారణ చేసుకోండి. పై అర మీద ప్యూరిటాస్ లేబుల్ ఉందో లేదో చూడండి. క్యాండిల్ యొక్క మెటల్ బేస్ పై ప్యూరిటాస్ పేరు, రిజిస్ట్రేషన్ నెంబర్ 196501 కోసం చూడండి.

మీకు అప్తులైన వారికోసం వాడదగినది.

# బల్సారా ప్యూరిటాస్

బల్సారా — సౌఖ్యమైన జీవనానికి అధునాతన సాధనాలు

BALSARA బల్సారా అండ్ కంపెనీ (...

43, సర్ఫిన్‌దాస్ మాస్టర్ రోడ్, ఫోర్ట్, బొంబాయి–400 023.

BLS 168 TEL




సంక్రాంతి సెలవులయిపోయి కాలేజీ తెరిచి పది రోజులయింది. సెలవులకు ఇంటికి వెళ్ళిన అనుపమ ఇంకా తిరిగి రాలేదు. అందుకు కారణం ఎంత ఆలోచించినా అర్థం కాలేదు సంధ్యకు. ఒక్క సంధ్యకేకాదు, కాలేజీలో ఏ విద్యార్థికీ అర్థం కాలేదు. ఇంకొరు ఇంకొరు అయితే ఇంతగా ఆలోచించేవారు కాదు. అనుపమ కాలేజీ బ్యూటీ! అందుకే విద్యార్థులు కూడా 'వర్రీ' అవుతున్నారు— అనుపమ రాలేదంటే. అందమే ఆనందం—అన్నారు కదా మరి!

ఈ పది రోజుల్లో సంధ్య రెండుత్తరాలు వ్రాసింది కాని అనుపమ నుంచి సమాధానం రాలేదు ఇక ఇలా కాదనుకొని అనుపమ రూమ్‌మేట్ సంధ్య, క్లాస్‌మేట్ వాసంతి ఆ ఆదివారం అనుపమ వాళ్ళ ఊరికి వెళ్ళి వద్దామనుకున్నారు. ఎంత— పది మైళ్లు దూరం. ఆర్. టి. సి. బస్సు ఉంది. ఉదయం బయల్దేరి వెళ్తే, సాయంత్రానికి తిరిగి రావచ్చు.

కాని ఉదయం బయల్దేరటానికి వీలు కాకపోయింది— బాటనీ ప్రైవేటు క్లాసు ఉండటంతో. మధ్యాహ్నం రెండు గంటలకు వెళ్దామనుకున్నారు.

వాసంతి వచ్చేసరికి సంధ్య మేకప్‌పూర్తి కాలేదు. కట్టిన చీర బాగలేదని మరొక చీర కోసం పెట్టె తీస్తున్నది.

"ఏం తల్లీ—ఇంకా చీర సింగారం కాలేదా?"

"అయిపోయింది ఒక్క నిమిషం."

ఒక్క నిమిషమని పది నిమిషాలకు బయల్దేరింది సంధ్య. రూమ్ తలుపు తాళంవేసి కారిడార్‌లోకి వచ్చారు ఇద్దరూ. ఇంతలోకి ఏం గుర్తుకు వచ్చిందో "జస్ట్ వన్ మినిట్ వాసంతీ!" అంటూ వేసిన తాళం తీసి రూమ్‌లోకి వెళ్ళింది సంధ్య. ఏమి మర్చిపోయిందా అని చూస్తే— అద్దం ముందు నిలబడి మరొకసారి పౌడరు అద్దుకుంటున్నది, బొట్టును సరిచేసుకుంటున్నది.

వాసంతి ఉద్దేశంలో సంధ్య అలంకరణ లేకపోయినా అందంగా ఉంటుంది. కాని సంధ్యకు అలంకరించుకుని మరీ అందంగా కనపడటం అంటే తగని ఇష్టం.

ఆదివారం కావటానేమో బస్సు రద్దీగా లేదు. వాళ్ళెక్కిన అయిదు నిమిషాలకు బస్ బయల్దేరింది.

జనవరి నెల ఆఖరు వారం. పడమటకు వాలిన సూర్యుని కిరణాలు నులివెచ్చగా చెంపలను తాకుతున్నాయి. ఊరిబయటికి వచ్చాక పచ్చని అనగోల గ్నగా వస్తున్న గాలి హాయిగా ఉంది.

బస్ ముందుకు పోతుంటే—రోడ్డు ప్రక్కని చెట్లు వెనక్కి పరుగులు తీస్తున్నాయి.

సంధ్యామనసు గతంలోకి పరుగులు తీసింది.

* * *

ఫస్టియర్ బి. ఎస్సి. చదువుతున్న అనుపమ ఆ రోజు ఉన్నట్లుండి షాపింగ్‌కు వెళ్ళింది రూమ్ మేటు రమణి కెమిస్ట్రీ రికార్డు రాస్తూ రూమ్‌లోనే ఉండి పోయింది. అనుపమ కావలసిన సామాను కొనుక్కుని, షాపింగ్ ముగించి, ఆ ప్యాకెట్ చేత్తో పట్టుకుని షాపులోంచి బయటికి వచ్చేసరికి పేవ్‌మెంటు మీది జాజిపూల సౌరభం ఆమె కాళ్ళకు బంధం వేసింది.

అనుపమకు జాజిపూలంటే ఎంత ఇష్టమో! నాలుగుమూరలు కొనుక్కున్నది. పొట్లం కట్టి ఇచ్చింది పూలమ్మి. బాగ్‌లో వేసుకున్నదే కాని మనసు నిలవలేదు. పొట్లంతీసి, విప్పి, ఒక్కసారి ఆ పూలను ఆఘ్రాణించి, తల్లో తురుముకున్నది.

అయితే — ఆ సెంటర్లో నిలుచున్న నలుగురు యువకులు తననుగమనిస్తున్నట్లు అనుపమకు తెలియదు.

అసలే అనుపమ అందాలగని. మేనిని బంగారం సిగ్గుపడే ఛాయ, సంపెంగ పువ్వును ఎక్కిరించే ముక్కు, గులాబీలతో పోటీపడే బుగ్గలు, మీనాక్షి అంటే సరిపోయే కనుదోయి— అందాల అనుపమకు ఎర్రని ఫారిన్ నైలెక్స్ చీర మరింతశోభను చేకూరుస్తున్నది. చీరకి మేచ్ అయ్యేటట్టుగా ధరించిన ఎరుపురంగు జాకెట్టు మరింత సౌందర్యం సమకూరుస్తున్నది.

తల్లో తెల్లని జాజిపూలు.

అటు సంజవెలుగు - ఇటు మెర్క్యురీ కాంతులూ కలిసిన మనోజ్ఞ వాతావరణం.

దివినుంచి దిగివచ్చిన దివ్యసుందరిలాగా భాసిస్తున్నది అనుపమ.

ఇంత అందాలరాశి కాబట్టే, క్రితం సంవత్సరం వరకు సంధ్య కిచ్చిన 'కాలేజీ బ్యూటీ' బిరుదు, ఈసంవత్సరం అనుపమకు ఏకగ్రీవంగా ప్రదానం చేశారు కాలేజీ విద్యార్థులు.

విద్యార్థినులూ అందుకు అభ్యంతరం చెప్పలేదు.

సంధ్య కూడా స్పోర్టివ్ స్పిరిట్‌తో, తన రాంక్ అనుపమకు బదలాయించింది.

ఆ కాలేజీబ్యూటీ బజారులో ఒంటరిగా కన్పించేసరికి ఆ నలుగురు యువకులూ ఏదో చిన్నగా మాట్లాడుకున్నారు. వారి వాలకం చూస్తుంటే ఏదో పందెం కాసుకున్నట్లు కూడా ఉంది.

అందులోని పొడుగుజుట్టు పోలిగాడు తలవంచి బెల్‌బాటం వంక చూసుకున్నాడు. ఆ తర్వాత తల ఎగరేశాడు; కాలరు సవరించుకున్నాడు.

గబగబా నడిచి అనుపమను చేరాడు.

ఇదంతా రోడ్డుకు మరొకపక్కన ఉన్న సంధ్య గమనిస్తున్నట్లు ఆ చతుష్టయానికి తెలియదు.

పొ. పో. గాడి కంటే త్వరగా సంధ్య నడిచింది- అనుపమ వైపు.

అయినా వాడు అప్పటికే అనుపమ వెనుకగా నడుస్తూ ఆమె తల్లోని జాజి పూలను వాసనచూసి, ఒక్క పువ్వు తుంచాడు భిత్తరపోయి అనుపమ వెనక్కి తిరిగితే పొ. పో. గాడు వెకిలినవ్వు నవ్వి, ఆ పువ్వు ముక్కుదగ్గర పెట్టుకున్నాడు. తను చేసిన ఈ ఘనకార్యానికి గర్వపడుతూ తన స్నేహితులకోసం వెనక్కి తిరిగాడు.

తిరిగితే-

కలకత్తా కాళిలాగ సంధ్య కనపడింది.

వాడు కంగారుపడి, అడుగు వెనక్కి వేసేసరికి, సంధ్య ఎడమ కాలి చెప్పు విప్పింది.

వాడు నిలువుగుడ్లు పడిపోయాడు.

చెప్పుతో సంధ్య ఎడా, పెడా వాయిస్తుంటే- వాడేమీచేయలేకపోయాడు. ఈలోగా జనం చుట్టూ చేరారు. జనానికి జరిగింది తెలియకపోయినా ఆడపిల్లను అల్లరి పెట్టుంటే, ఆ ఆడపిల్ల ఆడపులి అయి ఎదురు తిరిగిందని అర్థం చేసుకుని తలోమాటా అన్నారు వాడిని. ఆడపిల్లలు గల తండ్రులు కసితీరా తిట్టిపోశారు వాడిని. కాలేజీలో చదివే చెల్లెలుగల ఒక అన్న వాడి మీద చెంపలు చేసుకున్నాడు.

ఈలోగా సంధ్య అనుపమను చేయిపట్టుకుని, జనంలోంచి తప్పించి, ఎదురుగా

కన్పడ్డరిక్షాలో ఎక్కించి; తనూ ఎక్కి, లేడీసు హాస్టలుకు పోనీయమంది.

సంధ్య చూపిన అసాధారణ ధైర్యానికి ముందు ఆశ్చర్యపోయినా, ఆ తర్వాత 'షెహభాష్' అన్నారు విద్యార్థినులందరూ.

సోషియాలజీ స్టూడెంట్స్ మాత్రం సంధ్యకు ఇంత ధైర్యం ఎలావచ్చిందీ అని శోధించారు. నడిబజారులో ఒక యువకుణ్ని—వాడు చేసింది ఎంత తప్పుపని అయినా—చెప్పుచ్చుకుని కొట్టే గుండెధైర్యం ఎక్కడి నుంచి వచ్చింది అని వింతగానో ఆలోచించారు.

ఫామిలీ బాక్‌గ్రౌండు విచారించారు—సంధ్య తండ్రి మిలటరీలో పెద్ద ఆఫీసర్. సంధ్య అన్న ఇటీవల ఐ. పి. యస్. ప్యాసయ్యాడు. రక్తంలోనే ఉంది ఆ ధైర్యం అని తేల్చేశారు.

వీళ్లంతా సంధ్య గురించి ఆలోచిస్తుంటే సంధ్య అనుపమ గురించి తీవ్రంగా ఆలోచించింది.

## భయం

అనుపమ అంటే సంధ్య కెంతో ఇష్టం. అనుపమ అందమంటే ఇంకా ఎంతో ఇష్టం.

అనుపమ పువ్వులా సుకుమారమయింది. మకరందంలా మధురమయింది. మకరందం కోసం పువ్వుమీద తుమ్మెద వాలకూడదు—అనుపమను కంటికి రెప్పలా కాపాడాలన్న నిర్ణయానికి వచ్చింది సంధ్య. అందుకే హాస్టల్ వార్డెన్‌తో మాట్లాడి, అనుపమను తన రూమ్‌కు మార్చుకుంది.

ఇప్పుడు అనుపమా, సంధ్యా రూమ్ మేట్స్.

*    *    *

అనుపమతో జరిగిన పరిచయం సంధ్య మనో వీధిలో కదలాడింది.

మధ్యలో ఏదో చిన్న ఊరు. బస్సు ఆగింది. నలుగురు దిగారు. ఇద్దరు ఎక్కారు బస్సు బయల్దేరింది.

పక్కకి తిరిగి చూస్తే వాసంతి మరేదో లోకంలో ఉన్నది.

వాసంతి ఆలోచన సంధ్య చుట్టూ—

*    *    *

సెకండియర్, థర్డియర్ స్టూడెంట్స్‌కు అక్టోబరు పరీక్షలు. ఫస్టియర్ స్టూడెంట్స్‌కు టెర్మినల్ ఎగ్జామ్స్ జరుగుతున్నాయి. ముందు చదివినా; చదవక పోయినా రేపటి పరీక్షకు ఈరోజు రాత్రి కష్టపడి చదివితేనే ఫలితం దక్కేది. పరీక్షా విధానమే అలాగ ఉంది.

రాత్రి పది గంటలవేళ—

విద్యార్థినులందరూ సీరియస్‌గా చదువుకుంటూ ఉండగా లైట్లు ఉన్నట్లుండి ఒక్కసారి ఆరిపోయాయిహాస్టలులో.

"అయ్యో! లైట్లు పోయాయే!" అనుకున్నారు కొందరు. అనుకొని చీకట్లో తడుముకుంటూ, కప్ బోర్డులోని కొవ్వొత్తులు వెతికి తీసి, వెలిగించుకుని ఆ గుడ్డి

(36 వ పేజీ చూడండి)

# పెరుగుతున్న సంవత్సరాలు కాల్షియం-శాండోజ్® సంవత్సరాలు










పాప పుట్టక ముందు నుంచే, పాప యొక్క పళ్ళూ ఎముకలూ రూపొందటం మొదలెడతాయి. పసిదనం నుంచీ, పెరిగే వయస్సులో అంతా కూడా కాల్షియం ఎంతో కీలకమైనది.

మీ పాపకి గనక, పెరుగుతూన్న ఏ దశలోనైనా సరే, అవసరమైనంత కాల్షియం లభించకపోతే, తరవాత ఎంత యిచ్చినా ప్రయోజనం ఉండదు. అందుకే నేడే మీ పాపకు కాల్షియం-శాండోజ్ యివ్వడం మొదలెట్టండి. రోజుకు నాలుగు కాల్షియం-శాండోజ్ బిళ్ళలు గనక యిస్తే, అవి పెరిగే దశలోని ఆ ఏళ్ళలో అత్యవసరమైన కాల్షియంను సమకూర్చి, గట్టిపళ్ళనూ, పటిష్టమైన ఎముకలనూ రూపొందిస్తాయి. విటమిన్ సి, డి మరియు బి12తో పటిష్టం చేయబడిన కాల్షియం-శాండోజ్ బిళ్ళల్లో, పిల్లలకి యిష్టమయ్యే రుచిగల వెనీలా సువాసన ఉంది.

కాల్షియం-శాండోజ్
స్విట్జర్‌లాండ్‌లోని శాండోజ్
వారు రూపొందించినది,
ప్రపంచంలోని
అత్యుత్తమమైన కాల్షియం.

## కాల్షియం-శాండోజ్®

**గట్టిపళ్ళు, పటిష్టమైన ఎముకల కోసం**




daCunha/CS/25D TEL/Rev.



సీరియల్

# మోహనరూప

మాదిరెడ్డి సులోచన

( గత సంచిక తరువాయి )

మర్నాడు ఇద్దరూ లేచి ముఖాలు కడుక్కుని దగ్గరగా ఉన్న హోటల్లో టీ త్రాగారు. అప్పటికే సమయము ఏడు దాటింది.

"రూపాదేవిగారు క్లినిక్‌కు ఏడు గంటలకే వస్తారు" అన్నాడు ఇంద్రమోహన్. ఇద్దరూ క్లినిక్‌కు వెళ్ళారు లోపలి గదిలో నుండి రూపాదేవి, మరో మగ గొంతు నవ్వులు ఆగకుండా వినిపిస్తున్నాయి. విశ్వం ముఖం చిట్లించాడు.

"బాగుంది శోభన్! సినిమా హీరోల పేరంటే ఇంత చిక్కా." నవ్వుతూ రూప బయటికి వచ్చింది

"గుడ్ మార్నింగ్! మీ కోసం వద్దామనుకుని, ప్రాణస్నేహితులు ఎన్ని విషయాలు మాట్లాడుకోవాలో అని రాలేదు...." అన్నది.

"మీరిద్దరు స్నేహితులేగా, మాట్లాడుకోవలసినవన్నీ మాట్లాడుకున్నారా ?" అన్నాడు విశ్వం గుమ్మంలో నిలబడిన శోభన్‌ను చూస్తూ.

"మా దగ్గరి బంధువులబ్బాయి. వాళ్ళ తాతగారి పేరు శోభనాద్రి. స్టైలుగా శోభన్ అని పెట్టుకున్నాడు. వాళ్ళక్కయ్య ఊరు వెడితే, పిల్లలు మా శోభన్ మామయ్య వచ్చాడని గొప్పగా చెప్పారట. సినిమా స్టారా అంటే గొప్పకోసం 'ఆఁ' అన్నారట పది నిమిషాల్లో అభిమానుల క్యూ కొండవీటి చాంతాడంత అయిందట. ఏమి శోభన్ సన్మానం కూడా చేస్తామన్నారా ?" రూపాదేవి మరోసారి నవ్వింది.

"మీరు మరీను.." శోభన్ సిగ్గుపడ్డాడు

"ఇంద్రమోహన్ గారూ, అక్కడ బాత్ రూమ్‌లో ఫ్లోరింగ్ గుమ్మము వైపు పల్లంగా ఉంది."

"లేదే, నిన్న నేను దగ్గరగానే ఉన్నాను."

"రండి చూపుతాను..." ఇద్దరూ చక, చక తయారయిన వింగ్ వైపు వెళ్ళారు. ఆమె చూపిన చోట చూచాడు. "యెంత జాగ్రత్తగా ఉన్నా, ఎక్కడో చోట పొరపాటు చేస్తారు ఈరోజు రానివ్వండి మేస్త్రీ పని చెబుతాను" అన్నాడు

"అలాగే దగ్గరుండి హాంగర్స్ ఫిక్స్ చేయించండి."

"మంచిది. రాత్రి విశ్వం నా గదికి వస్తానంటే పంపించివేయటమేనా! నా దగ్గర బట్టలున్నాయో, లేదో అని ఆలోచించకూడదా?" అన్నాడు కాస్త కినుకగా.

"సారీ...మీరిద్దరయితే స్వేచ్ఛగా మాట్లాడుకుంటారనుకున్నానేతప్ప మిగతా విషయాలు ఆలోచించలేదు"

"సరే! క్లినిక్ శోభన్‌గారు చూసుకుంటారు. విశ్వం, మీరు హాయిగా తిరిగి రండి."

ఆమె అతడినే దీక్షగా చూచింది తిరిగి చూచేసరికి తననే దీక్షగ చూస్తున్న విశ్వం కనిపించాడు. ఆమె అతనివైపు వెళ్ళింది.

*9*

రూపాదేవికి ఏం పాలుపోలేదు. రోగుల సంఖ్య పెరిగిందని, శోభన్‌ను పిలిపించింది. ఇద్దరికి ఉన్న క్లినిక్ చాలటంలేదు తయారయిన వింగ్‌లోకి షిఫ్ట్ చేద్దామంటే తండ్రి లేడాయె మెల్లగా కారు నడపడవుతుందని, కారు క్లినిక్ ముందే వదిలి, నడిచి ఇంద్రమోహన్ నివాసానికి వచ్చింది. వర్షం రావటానికి సూచనగా ఆకాశమంతా మబ్బు పట్టింది. ఉక్కగా ఉంది. సిమెంటు బస్తాలు వరండానుండి, మరో గదిలోకి వేస్తున్న ఇంద్రమోహన్, వాచ్‌మెన్ కనిపించారు. ఆమె చాలా నొచ్చుకుంది. విద్యాధికుడయిన యువకుడు కూలి పని చేయటమా !

ఇంద్రమోహన్ కళ్ళు ఆనందంతో రెప, రెప లాడాయి. "మీరు గదిలో కూర్చోండి. అయిదు నిమిషాల్లో వస్తాను." అన్నాడు, ఆమె గమత్తుగా ఉన్న సిమెంటు రంగు జుత్తును చూస్తూ నిల్చుంది.

"చదువూ, సంస్కారం, నాగరికత గలవారి గదిలాగే ఉంది వెళ్ళండి..." అనుకుంటూ సంచి యెత్తుకున్నాడు.

"ఉండనియ్యండి, అర్జెంటుగా మాట్లాడాలి."

ఆమె వచ్చి, గదిలోకి చూచి విస్మితురాలయింది. శుభ్రంగా ఉంది. యెదురు గోడకు గ్లాక్సో బేబి బొమ్మ చిరునవ్వులు చిందిస్తూ ఉంది. చిన్న పాతమంచం, దానిపై పరుపు చుట్టా, ఒక మూలకు స్టౌ ఉన్నాయి ఆమె యెక్కడ కూర్చోవాలో తెలియలేదు అతను ముఖం నుండి నీళ్ళోడుతుండగా వచ్చేశాడు చిన్న లాగులో తమాషాగా కనిపించాడు. ఆదరా, బాదరాగా లుంగీ చుట్టుకుని, తల తుడుచుకున్నాడు.

"రండి... కూర్చోండి" మంచం చూపాడు ఆమె వెళ్ళి కూర్చుంది అతను ట్రంకుపెట్టెమీద కూర్చున్నాడు.

"మీరు ఈసారి వచ్చేసరికి, మీకోసం కుర్చీ కొంటాను." అన్నాడు నొచ్చుకున్నట్టుగా.

"సరేగాని కూలీలు చేసేపని మిమ్మల్ని యెవరు చెయ్యమన్నారు ?"

"ఒకరు చెయ్యమంటే చేస్తానా! వర్షం వచ్చి, జల్లు పడిందంటే ఆ సిమెంటు గడ్డ కడుతుంది. పనివాళ్ళంతా వెళ్ళిపోయారు. ఇక మిగిలింది వాచ్‌మెన్ నేను కూర్చుని సంచులు మొయ్యరా అంటే వింటాడా? పోవయ్యా నువ్వు పెద్ద జీతగాడివి నేను చిన్న జీతగాడిని అంటాడు..."

"ఇంద్రమోహన్‌గారూ! మిమ్మల్ని జీతగాడిలా చూస్తున్నామా!" ఆమె కళ్ళలో బాధ సుళ్ళు తిరిగింది.

"అబ్బెబ్బే! అందుకు కాదండీ మీ అభిప్రాయం యెలా ఉన్నా, మిగిలిన వారలా అనుకుంటారని అంటున్నాను" అన్నాడు కంగారుగా తనెంత అనాలోచితంగా మాట్లాడాడు!

**జరిగిన కథ-4:** స్నేహితులు విశ్వం, ఇంద్రమోహన్, పాషా, స్యామ్సన్, చక్రిలు విహారయాత్ర ముగించుకొని హైదరాబాద్ చేరినపుడు ఇంద్రమోహన్ ఐ డి. పి. ఎల్‌లో ఇంటర్వ్యూకి వెళ్ళగా, మిగిలిన స్నేహితులు, అక్క సుగుణ, బావలతో కలిసి ఒక సంబంధం చూస్తాడు విశ్వం. ఆమె శ్రీహరి, రుక్మిణీల ఏకైక కుమార్తె డాక్టర్ రూప ఆమె ఆహ్వానంమీద ధనికుడైన విశ్వం బీదవాడైన ఇంద్రమోహన్‌తో నర్సింగ్‌హోమ్ చూడటానికి సాగర్ వెళ్తాడు కానుకలన్నా కోరలేదన్న కారణంగా తనకు, తన చెల్లెలు పూర్ణకు కుండమార్పిడి సంబంధం విఫలమవడం, ఉద్యోగ ప్రయత్నంలో మోసగింపబడడంవల్ల ఇంద్రమోహన్ నిరాశా నిస్పృహలకు లోనవుతాడు. రూప తండ్రి విదేశాలకు వెళ్ళిన సమయంలో ఇంటి వ్యవహారాలు చూసే ఉద్యోగం చేస్తూ ఆమె నడవడి కనిపెట్టటానికి ఇంద్రమోహన్‌ను పంపుతాడు విశ్వం

"నేను చేస్తున్నానని తనూ వచ్చాడు. లేకపోతే కూలీల కోసం వెతుకవలసి ఉండేది."

"నాన్నగారు రాకపూర్వమే క్లినిక్ షిఫ్ట చేద్దామా! ఆ ఒక్క గదిలో భలే చికాకుగా ఉంది కొందరు రోగులు వర్షంలో తడువవలసివస్తుంది."

"యెలాగు నర్సింగ్‌హోమ్ పూర్తి అయ్యాక, నాన్నగారు వచ్చేక పెద్ద యెత్తున ఫంక్షన్ చేస్తారు కదా! పోనీ ఇప్పుడు మన కథానాయకుడి చేత ప్రారంభోత్సవం చేయిద్దాం."

"యెవరు? శోభన్‌చేతా?"

"భలేవారే." ఈసారి పక పక నవ్వటం ఇంద్రమోహన్ వంతయింది.

మనసులో ఏ కల్మషం లేనివారే అంత స్వచ్ఛంగా, నిర్మలంగా నవ్వగల్గుతారు' అనుకున్నది

"కాదండీ! ఈ సాగర్‌లో క్లినిక్ పెట్టమని ఆదేశించిన మీ తాతగారు..." అన్నాడు.

"పంపారు పొండి, మా తాతగార్ని హీరోను చేసి వేశారు ఈ విషయం తెలిస్తే ఆయన ఛాతి పరి సాల్గు రెట్లు అవుతుంది" అన్నది నవ్వుతూ

"మీకు టీ చేసి పెడతాను, ఒక్క నిమిషంలో"

"అబ్బే! ఆ శ్రమ యెందుకు! ఇంటికివెళ్లి త్రాగుదాం పదండి" అన్నది ఇద్దరూ లేచి గదికి తాళం పెట్టి నడక ప్రారంభించారు. టప్‌మని పెద్ద చినుకు పడింది. క్లినిక్ చేరుకునే వరకు సగం తడిసిపోయారు ఇద్దరూ ఇంటికి వచ్చేసరికి శోభన్ కాఫీ త్రాగుతున్నాడు.

"డాక్టరు గారూ! మీ కోసం చూచి, చూచి కాఫీ త్రాగుతున్నాను."

"ఫరవాలేదు శోభన్ క్లినిక్ విషయం మాట్లాడుదామని, వీరి దగ్గరకు వెళ్లి వస్తున్నాను" అన్నది ఇద్దరూ లోపలికి వచ్చాక, రూపాదేవి వెళ్లి బట్టలు మార్చుకు వచ్చింది.

"మీరు తడిసిపోయారు..."ఆమె నొచ్చుకుంది

"ఈ మాత్రం దానికేనా! మరేం ఫరవాలేదులెండి."

"నాన్నగారి పైజమా లాల్చి ఉండాలి..." ఆమె వెళ్లి బట్టలు తెచ్చింది.

ఇబ్బందిగా చూచి, బట్టలు వేసుకున్నాడు. గొంతుకో దిగేసినట్టు అయింది అతని హృదయంలోని మధుర స్మృతులను యెవరో కెలికి తీసినట్టు అనిపించింది విద్యార్థి జీవితంలోని మధురిమ, అనుభూతి, నిర్లక్ష్యం మరిచిపోగలడా! ఓ సారి తడిసి వచ్చి బట్టలు లేక పాషా బట్టల వేసుకున్నాడు అందులో దిగబడిపోయినట్టు అయింది.

"ఒరేయ్ ఆ గుడ్డలతో వీధిలోకి వెడతావుట్రా!" విశ్వం అడిగాడు

"ఆహా! మహారాజులా వెడతాను. కావాలంటే మెడలో నాల్గు పూసల దండలు వేసుకుని మరీ వెడతాను. అందరు హిప్పీ అనుకుంటారు" అన్నాడు, జుట్టు ముఖాన పడేలా దువ్వుకుంటూ. మర్నాడు అలాగే కాలేజికి వెళ్లిన నాల్గో గంటకు ప్రిన్సిపాల్ దగ్గర నుండి పిలుపు వచ్చింది

"మిస్టర్! ఫ్యాషన్లు అంటే నాకిష్టమే కాని, పిచ్చివేషాలు వేస్తే మాత్రం ఒళ్లు మండుతుంది. నీవేదో బుద్ధిమంతుడివి అనుకున్నాను" అని వార్నింగ్ ఇచ్చాడు

మరో రోజు విక్రం గళ్ల ప్యాంటు, పువ్వుల చొక్కా వేసుకున్నాడు విక్రం అందర్లో అర్భకుడు

"ఒరేయ్! నా గుడ్డలు పిలికి పోతాయిరా"

మన స్నేహం కన్నా విలువయిన వట్రా నీ గుడ్డలు! దుష్టుడా! దుర్మార్గుడా! పవిత్ర స్నేహానికి అర్థం తెలియని పాపి..." అన్నాడు సీరియస్‌గా

"ఒరేయ్ శపించకురా! నీ శాపానికి నా పాత జోడు లేసు తెగిపోతుందేమోనని భయంగా ఉంది"

"ఊఁ! నా శాపం ఉపసంహరించుకోవాలంటే, సాయంత్రం తాజ్‌మహల్లో టిఫిన్, కాఫీ ఇప్పించాలి..."

"చిట్టి తండ్రీ! ఆ ప్రక్కనే వెంకటేశ్వర ఉంది సినిమా వద్దా"

"భక్తులిచ్చేది ఏది కాదనకూడదని మా నియమము" సీరియస్‌గా అన్నాడు.

"మరోసారి నా బట్టల జోలికి వస్తే నిన్ను తన్నాలని నా నియమము" కోపంగా చూచాడు

"మరోసారి కదా, ఈ సారికి పరవాలేదన్న మాట" నవ్వేసి కాలేజికి బయలుదేరాడు. బస్టాండలో అమ్మాయిల గుంపు కనిపించి, తనను పరీక్షగా చూస్తుంటే, గర్వంగా ఛాతి విరుచుకున్నాడు.

"అమ్మాయిలే అంగి ప్రదర్శన చేస్తారను కుంటే, అబ్బాయిలు మొదలెట్టారే ఆ మహా నాయుడిని చూడు" ఓ కోమలాంగి కిసుక్కున నవ్వింది

ఉలికి పడి చూచాడు సీతాకోకల గుంపు నుండి తప్పించుకుందామని పరుగులు పెట్టినట్టే కాలేజికి వెళ్లాడు మెట్లు ఎక్కుతుండగా ప్యాంటు పట, పట మన్నది.

"స్టైలుగా నడిచినట్టు నడిచి, కుర్చీలో కూర్చోగానే పూర్తిగా చిరిగింది ఈ సారి మగ పిల్లలు నవ్వారు. పీరియడ్ అయిపోగానే క్రిందికి వచ్చి రిక్షా చేసుకుని హాస్టలు చేరాడు ప్యాంటు విప్పాడు, లుంగీ చుట్టుకుని

"ఒరేయ్ . నీ నోట్లో ఆ యయ్యరు హోటల్లోని సాంబారు పడ, నీ పరీక్ష పేపరు అతి కష్టంగా రాను నీవు అభిమానించే ఆంధ్ర మహిళా సభ కాలేజి అమ్మాయి పెళ్లిగాను..."

విక్రం శాపాలు గుర్తుకు వచ్చాయి అతనికి నవ్వు వచ్చింది

"ఏమిటండోయ్! మీలో మీరే నవ్వుకుంటున్నారు?" శోభన్ అడిగాడు.

"కాలేజి రోజులు గుర్తుకు వచ్చి.." అతను చెప్పాక అందరూ మరోసారి నవ్వుకున్నారు

"రేపు వచ్చే శుక్రవారం తాతయ్యను రమ్మని వ్రాస్తాను. సింపుల్‌గా కానిచ్చేద్దాం."

"అలాగే. మిగతా ఏర్పాట్లన్నీ నేను చూస్తాను. మొన్న ఇచ్చిన వెయ్యి రూపాయల లెక్క ఇవ్వనేలేదు నేను"

"తొందరేం!"

"మీకు తొందర లేకపోవచ్చు, మాకు ఇబ్బంది."



"వ్రాసిపెట్టండి తీరిక ఉన్నప్పుడు చూచు కుంటాను" అన్నది వర్షం పెద్దదయింది ..గ్గురా కబుర్లు చెప్పుకుని, అక్కడే భోజనాలు చేసి, పేకాడారు ఓ గంట కాగానే శోభన్ పేకలు గిరాటు వేశాడు, లేచాడు

"అదేం ? అప్పుడే లేచావ్ !"

"స్టేక్ లేనిది మజా ఏముంది డాక్టరు గారూ !"

"దానికి ఇంద్రమోహన్ అంగీకరించరుకదా." అన్నది రూప

"అవునండీ ! కాలక్షేపానికి బాగానే ఉంటుంది. స్టేక్‌తో ఆడాం అనుకోండి. గెలిచినవారికి ఇంకా గెలువాలని ఉంటుంది. ఓడినవారికి పోగొట్టుకున్న డబ్బు రాబట్టుకోవాలని ఉంటుంది..."

"ఉంటే తప్పేం ?" శోభన్ అడిగాడు.

"తప్పని నేను అనటంలేదు. పేకాట,

## అమెరికా ప్రెస్‌క్లబ్ కథ

అమెరికాలో నేషనల్ ప్రెస్ క్లబ్ 1933 నుంచి ప్రపంచ నాయకులకు విందు సమావేశాలు ఏర్పాటు చేయడం ప్రారంభించింది. అప్పటి నుంచి ఎందరెందరో ప్రపంచ దేశాల ప్రముఖులు ఈ క్లబ్బు సభ్యుల నుద్దేశించి ప్రసంగించారు.

వాషింగ్టన్‌లోని నేషనల్ ప్రెస్ క్లబ్బు ఒక బహిరంగ వేదికలాంటిది ప్రపంచ ప్రముఖులు వివిధ అంశాలపై తమ అభిప్రాయాలను వెల్లడించుకొనటానికి ఉపయోగపడుతున్న వేదిక ఇది

1908 లో ఈ క్లబ్బు స్థాపించబడింది ప్రెసిడెంటు థియోడార్ రూజ్వెల్టు మొదలు ఇప్పటి వరకు అమెరికా దేశాధిపతులందరూ ఈ ప్రెస్ క్లబ్బులో ప్రసంగించారు

నేషనల్ ప్రెస్ క్లబ్బు మొదట 200 మంది వాషింగ్టన్ వార్తా విలేఖరులతో ప్రారంభమైంది. ఇప్పుడు ఈ క్లబ్బు సభ్యత్వం 5000 దాకా ఉన్నది. వీరిలో వార్తా పత్రికలు, మేగజైన్లు, వాణిజ్య పత్రికలు, రేడియో, టెలివిజన్ విలేఖరులు, పబ్లిసిటీ, పబ్లిక్ రిలేషన్స్ ప్రతినిధులు ఉన్నారు. ఈ క్లబ్బు సభ్యులలో సుమారు 10 శాతం అమెరికన్‌లు కారు వీరిలో వాషింగ్టన్‌లోని విదేశీ రాయబార కార్యాలయాల పత్రికా విషయాల అధికారులు కూడా ఉన్నారు

డౌన్‌టౌన్ వాషింగ్టన్‌లో నేషనల్ ప్రెస్ క్లబ్బు పని చేస్తున్నది ఇది వైట్ హౌసు, విదేశాంగ శాఖ కార్యాలయం, అమెరికన్ కాంగ్రెసు (పార్లమెంటు) కి సమీపంలో ఉన్నది ఇంకా ఈ భవనంలో వార్తా సంస్థలకు చెందిన 500 దాకా వాషింగ్టన్ బ్యూరో కార్యాలయాలు కూడా ఉన్నాయి. ఈ క్లబ్బు లైబ్రరీలో ప్రపంచ వ్యాప్తంగా ప్రచురితమౌతున్న వార్తా పత్రికల ప్రతుల ఫైలు ఉంటుంది ఒకప్పుడు ఈ క్లబ్బు సభ్యత్వం పురుషులకు మాత్రమే పరిమితమై ఉండేది ఇప్పుడు మహిళా విలేఖరులు కూడా ఈ క్లబ్బులో చేరవచ్చు ★

---

రేసులు, లాటరీలు ఒక పిచ్చిలాంటివి డబ్బు తేలికగా వస్తుందన్న అభిప్రాయం ఉంటుంది. మా బాబాయి ఒకరు దీనిమూలంగా ఉరి వేసుకున్నారు.''

''అందరూ అలాగే ఉంటారా!''

''శోభన్! నా నిరాసక్తతను తెలిపాను అంతే'' అన్నాడు. అతను వెళ్లి పడుకున్నాడు. ఇద్దరూ ఒక ఆట ఆడారు.

''నిజం! ఏదయినా పందెం ఉంటేనే ఆట రక్తి కడుతుంది.''

''అయితే ఓ పని చెయ్యండి. మా చెల్లాయి, మ్ముడితో వేసుకునే పందెంలాంటిది వేసుకుందాం.''

''ఏమిటబ్బా అది?'

''యెవరోడిపోతే వాళ్లు ఇరవయి అయిదు గుంజిళ్లు తీయాలి.''

''బావుందండీ!'' నవ్వింది రూప.

''ఆడదామా!'' కార్డ్సు పంచాడు. కావాలని ఓడిపోయాడు ఇంద్రమోహన్.

''ఇలా అయితే ఆట ఏం బాగుంటుంది. నేను గుంజిళ్లు తీస్తానని భయం కదూ చూడండి ఇంద్రమోహన్ కొద్ది సేపు నేను యజమానినన్న సంగతి మరిచి పొండి. విశ్వంతో యెలా ఉంటారో నాతో అలాగే ఉండండి.'' మెల్లగా అన్నది.

''ప్రయత్నిస్తాను.'' కార్డ్సు అక్కడ పడేసి చర, చర బయటికి వచ్చాడు.

''ఇంత రాత్రి వెళ్లకుంటేనేం?''

''వెళ్లాలండీ! తలుపులు వేసుకోండి'' అన్నాడు. ఆమె అతని ప్రవర్తనకు కారణం వెతుకుతూ నిలబడి పోయింది.

### 10

తాతగారు బస్సు దిగుతూనే ఇంద్రమోహన్, రూపల భుజాల మీద చేతులు వేసి, ఇద్దరిని దగ్గరగా తీసుకున్నాడు. ఇంద్రమోహన్ మంత్ర ముగ్ధుడిలా చూస్తూ నిలబడి పోయాడు. డబ్బై దాటినా దృఢంగా, బ్రమిసాలతో చెయ్యెత్తు మనిషి. చూడగానే గౌరవ భావం లాంటిది కల్గుతుంది.

''తప్పదియ్యా! మంచి జంట ఏమోయ్ మనవడూ, మా ఊరు రావటానికి నామోషి పడ్డావుట ఏమిటి కథ.

''నేనా!'' ఇంద్రమోహన్ అర్థం కానట్టు చూశాడు.

''ఇదీ సంగతి! మా రూప తప్పు అబద్ధాలు వ్రాయదు. మా రూప తరపున నేనున్నానని మరిచిపోకు...''

రూపకు తాతగారి భావం అర్థం అయింది ఆమె ముఖం కందగడ్డలా అయింది.

''తాతయ్యా! ఇతను.. ఇతను...''

''తప్పదియ్యా! ఆ మాత్రం తెలియదా నాకు! నా కాబోయె మనవడు, నీ కాబోయే భర్త విశ్వం...''

''నన్ను చెప్పనియ్యవు. ఇతను విశ్వం కాదు తాతయ్యా! మన నర్సింగ్ హోమ్ కట్టిస్తూ పర్యవేక్షణ చేస్తున్న ఇంద్రమోహన్ గారు, విశ్వం గారి స్నేహితులు.''

''అలాగా! ఏం అనుకోకు బాబూ! ఏదో ముసలి చాదస్తం. అయినా తప్పంతా నీది రూపా! దిగగానే పరిచయం చెయ్యరూ?''

''నువ్వు నాకా అవకాశం ఇవ్వందే.'' ఇద్దరూ కలిసి తాతయ్యను క్షేమంగా ఇంటికి తెచ్చారు శోభన్ నమస్కరించాడు

''చూడవయ్యా బాబూ! నీ స్నేహితుడిని నీవుగా భావించి అభినందించాను...''

''తాతయ్యా! అతను శోభన్ అని రాజేశ్వరి పిన్ని తోడికోడలుగారబ్బాయి...''

''అరే...అలాగా చెప్పవేం? తప్పదియ్యా, మరి నీ హీరో యెక్కడమ్మా! చిన్నప్పుడెప్పుడో చూచాను...''

''తరువాత బస్సులో వస్తారు తాతయ్యా ఇతనేమో నాకు సహాయం చెయ్యటానికి వచ్చాడు.''

''హరి చెప్పాడు వాడే మతిమరుపు. ఏం రంగమ్మా బావున్నావా? అమ్మాయి చిక్కి పోయిందేం?'' పనిమనిషిని పలుకరించాడు. ఆమె వంగి అతని పాదాలకు దండం పెట్టింది.

''పని అయ్యగారూ! హాస్పత్రి కట్టడం పూర్తి అయితే అమ్మాయిగారికి నిశ్చింత...''

''తప్పదియ్యా! హాస్పత్రి..'' మీసం మెలివేసి నవ్వారు కళ్లు చికిలించాడు

''ఆ మూడు ముళ్లు పడితే...''

''తాతయ్యా! ప్రారంభోత్సవం చేసేది తమరే త్వరగా తయారవ్వండి.'' తొందర పెట్టింది రూపాదేవి

అతను స్నానం చేసి, ఖద్దరు పంచె, పట్టు చొక్కా వేసుకుని ఉత్తరియం వేసుకున్నాడు. నుదుట చందనం, కుంకం కలిపిన బొట్టు పెట్టు కున్నాడు.

''మీ మేనేజర్ ఎక్కడమ్మా! అతని పేరేమిటో...ఇంద్రుడా, చంద్రుడా!''

''ఇంద్రుడు, చంద్రుడు ఏవన్నా పలుకుతాడు. ఇంద్రమోహన్. శోభన్! నన్ను ఆస్పత్రి దగ్గర దింపేసి కారు తీసుకుని విశ్వం వస్తున్నాడేమో వెళ్లి రిసీవ్ చేసుకుంటావా?''

''అలాగేనండీ...'' తాతయ్యను తీసుకుని వచ్చేసింది. అక్కడ ఏర్పాట్లన్నీ సక్రమంగా చేశాడు ఇంద్రమోహన్.

''రూపాదేవిగారూ! రిబ్బను కట్టి తెంచడం నా కిష్టంలేదు యెందుకో. తాతయ్యగారికో పూలదండ వెయ్యండి. ఆయన బీదలకు మందు లిస్తారు. అదే ప్రారంభోత్సవము.''

''నాకు అలాంటి పట్టింపులేం లేవు ఏదో హడావుడి చెయ్యనిదే జనానికి తెలియదనిగాని...''

''మీరు వెళ్లి కూర్చోండి...'' ఆమె వెళ్లి తాతయ్య ప్రక్కన కూర్చుంది

గంట గడిచినా, శోభన్‌గాని, విశ్వంగాని రాలేదు. వాచ్‌మాన్ వెళ్లి బస్సు లేటని చెప్పాడు.

''మరి కాసేపు చూద్దామా?''

''అక్కరలేదు ఇప్పటికే గంట ఆలస్యం అయింది ఒక వ్యక్తి కోసం ఇందరిని కూర్చో బెట్టడం మర్యాదగా ఉండదు వాడికి వ్రాశాను కూడా త్వరగా వచ్చెయ్యమని...'' ఇంద్రమోహన్ విసుక్కున్నాడు

''అవునవును రాత్రి బస్సుకే రావాల్సింది.''

''కబుర్లు చెప్పకండి తాతయ్యా! నువ్వు వచ్చేశావని, ఆయన వస్తారు మీ మగాళ్లు...''

''ఆఁ.. అప్పుడేనా మగాళ్లమీద దండయాత్ర! మీ నాయనమ్మ అయిదేళ్లకు మొదలెట్టింది.''

[33వ పేజీ చూడండి]

## హైద్రాబాద్ సినిమా పేజీ

### 'విడని మమత

శ్రీ రాఘవేంద్రా ఫిలింస్ వారు 'విడని మమత' అనే చిత్రం తీస్తున్నారు. రమాకాంతపిస్సే దర్శకుడు. రచన, సహ దర్శకత్వం—ఎ. వేణుగోపాల్. సంగీతం—ఎస్. విజయ్. ఫొటోగ్రఫీ—వసంతషిండే. కళ—వి. కృష్ణమూర్తి.

హిమబిందు అనే కొత్త నటి నాయిక. 'స్నేహం'లో నటించిన వై. శంకర్ నాయకుడు. ఈయనా, రమాప్రభా, విజయలక్ష్మి తప్పిస్తే మిగతా వారంతా సరికొత్తవారే. వారిలో పుట్టపర్తి వాస్తవ్యుడు నారాయణరెడ్డి ఒకరు. మిగతావారు — నరేంద్రకుమార్, నాగశయన్, సంఘమిత్ర. ఈ చివరి యిద్దరూ బాలనటులు. మే 5 న షూటింగు ప్రారంభం అయిన ఈ చిత్రం ఈ వార్త వ్రాసే సమయానికి నాలుగురీళ్లు తయారైంది.

'యుగపురుషుడు'లో ఎన్.టి.ఆర్., జయప్రద





'సింహబలుడు'లో వాణిశ్రీ

### 'సుడిగాలి జీవితాలు'

నేటి మేటి నటి వాణిశ్రీకి రూపశిల్పిగా పని చేసిన కిషన్‌భండారి ఆమెపట్ల తనకు గల అభిమానాన్ని పురస్కరించుకుని తాను నెలకొల్పిన చిత్ర నిర్మాణ సంస్థకు వాణిశ్రీ కంబైన్స్ అని పేరు పెట్టారు 'సుడిగాలి జీవితాలు' అనే చిత్రం తీస్తున్నారు వర్ణాంతర వివాహాలు, వ్యభిచార నిర్మూలనం, మద్యపాన నిషేధం వగైరా సమస్యలకు సంబంధించిన ఈ చిత్ర కథను భండారి భార్య రామేశ్వరి వ్రాశారు మాటలు, పాటలు ఆయనే స్వయంగా వ్రాశారు ఫోటోగ్రఫీ — మహీధర్, ఎడిటింగ్ — మోహన్ సంగీతానికి ఎస్ పి బాలసుబ్రమణ్యాన్ని కుదుర్చుకోవాలని చూస్తున్నారట

అంతా ఔట్‌డోర్‌లోనే తీసే ఈ చిత్రంలో నటీనటులంతా కొత్తవారే హీరో వేషం టి వి రాజు వేస్తున్నారు సైడ్ హీరో పద్మనాభరావు, ఎలన్ ఎల్ వి కృష్ణమోహన్ రోజాశ్రీ, కవిత, అనంతలక్ష్మి ముఖ్య స్త్రీ పాత్రధారులు

హైదరాబాద్ ఫిలిం ఛేంబర్ ఆఫీసు మేనేజరు బి వి శేషయ్య కెమెరా స్విచ్ ఆన్ చేయటంతో ప్రారంభమైన తొలి షెడ్యూలులో నాలుగు రీళ్ల చిత్రం తీసినట్లు డైరెక్టరు కూడా అయిన భండారీ అన్నారు

వాణిశ్రీకి అప్పుడూ, తనకు గురువు అయిన వై మాధవయ్య ఈ చిత్రాన్ని 'సమర్పిస్తా' రన్న సంగతి చాలా ముఖ్యమని 'గురుభక్తి' ప్రకటించారు

### 'యువతరం'

తరంతరం నిరంతరం ముందుకు సాగుతూంది 'యువతరం', ఈ పేరుతో నిర్మిస్తున్నాం మేమొక చిత్రం, నిర్ణయించాం షూటింగుకు సారథీ స్టూడియోస్, భాగ్యనగరం, జూన్ పదునాలుగు బుధవారం ఉదయం ఏడూ ముప్పయిరెండుకు కుదిరింది శుభముహూర్తం, 'నవయుగ చిత్ర మందిర్' రాజమహేంద్రవరం కోరుతూంది మీ ఆగమనం, ఆశీర్వాదం — అంటూ అందింది ఒక ఆహ్వానం 12వ తేదీ సోమవారం

ఎవరా ఈ భావుకులు అనుకుంటూ వెళ్లగా దరహాస వదనాలతో సాదరంగా చెప్పారు స్వాగతం, సారథీ రెండవ ఫ్లోర్ ప్రాంగణంలో చిలక రంగు దుస్తులలో వున్న నిర్మాత కె ఎస్ రావు, వలక రంగు దిరీసుతో వున్న పబ్లిసిటీ ఇన్‌చార్జి దేవానంద్ లోన అడుగిడగానే గిరజా గడ్డం వున్న ఆజానుబాహువు డైరెక్టరు జి వి ప్రభాకర్‌తో అయింది పరిచయం శ్రీ సత్యాఫిలింస్ ఎ తారానాథ్ క్లాప్ కొట్టగా, ఉషా ఫిలింస్ పిన్నమనేని సత్యనారాయణ కెమెరా స్విచ్ ఆన్ చేయగా, ఛాయాగ్రాహకుడు పెద్దిరాజు గోపాలరావు తీసిన తొలి షాట్‌కు ఎదుట నిలిచింది పెద్ద ఇల్లాలు పండరీబాయి.

నరసింహరాజు, లక్ష్మీకాంత్, భానుప్రకాష్, పి. ఎల్. నారాయణ, బెనర్జీ, విజయమోహన్, వినోద్, రవిరాజ్, అల్లావుద్దీన్, జయశ్రీ, జమీలా, జయమాలిని, జయప్రియ, ఇంద్రాణి, గిరిజారాణి మొదలగువారు నటిస్తున్నారు.

'సాంకేతిక గణం'లోని ఇతరులు — కథ — వాకర్ల సూర్యచంద్రరావు, మాటలు—విజయరత్నం, సముద్రాల సుధాకర్, పాటలు — సి. నా. రె., వేటూరి సంగీతం — సత్యం, కళ — లీలాకృష్ణ, కూర్పు — సురేంద్రనాథ్, స్టిల్స్ — భాస్కర్. సహ దర్శకుడు—ఎం బాలు, నిర్మాణ సలహాదారు— కె ఎం నాయుడు

కలవారి ఇంటి బిడ్డలు చెడు అలవాట్లతో చెడ్డపనులు చేయకపోయినా మందికి మేలు చేసే మంచి పనులు చేయలేపోవటం లోపంగా, తప్పిదంగా ఎంచే తండ్రి తన తనయుల్ని తాను భావించిన పథానికి మరల్చడం ఈ చిత్ర కథ ఇతివృత్తం అని కథకుడు నిర్మాత అయిన కె. ఎస్. చెప్పారు.

పలువు తెలుపులో తీసే ఈ చిత్రం నూటికి అరవై వంతులు 'ఇన్‌డోర్'లో, నలభై వంతులు 'ఔట్‌డోర్'లో షూట్ చేయబడుతుందనీ, ఇప్పుడు ప్రారంభమైన తొలి షెడ్యూలులోనే షూటింగు ముగించి, మలి షెడ్యూలులో రికార్డింగు, రీ రికార్డింగు వగైరా పూర్తిచేయదలిచినట్లు బాలు తెలిపారు

### భూదేవి

తోట రామకృష్ణ, వి. నరసింహరాజు స్నేహ చిత్ర ప్రొడక్షన్స్ పేరిట 'భూదేవి' అనే చిత్రం తీయించారు రచన, దర్శకత్వం — ఎం. కె. సుగంబాబు ఛాయాగ్రహణం — దశరథరామయ్య, సంగీతం — మాస్టర్ వేణు. కూర్పు — మహేశ్. నటీనటులు దాదాపు అంతా కొత్తవారే.

— ఎం ఎస్. శర్మ ●

## జి. వి. జి. పేజీ

### దొంగలవేట

ఆనంద్, నీలుల కారు ఒక రహస్య స్థలం దగ్గర ఆగింది అందులోంచి వాళ్ళు డబ్బు పెట్టె తీసుకొని, గోపీతో రిగి, టైగర్ దగ్గరికి వచ్చారు ఆనంద్ బాక్స్ యివ్వబోయాడు ''ఇప్పుడు టైమ్ ఎంత ?'' అంటూ టైగర్ కోపంతో ఆనంద్ చెంపమీద ఒక్కటిచ్చి, ''నాలుగున్నర నాలుగు గంటలకు రావల్సింది,'' అన్నాడు

'సారీ, సార్! కారు ట్రబులిచ్చింది,'' అన్నాడు ఆనంద్ చెంప తడువుకుంటూ

టైగర్ పెట్టె మూత తెరిచి, డబ్బు చూసి ఆనందంగా నవ్వుతుంటూండగా ''డబ్బంతా సరిగ్గా వుందో — లేదో లెక్కపెడదామా ?'' అంది నీలు (సుచిత్ర)

''ఛ చదువుకున్నోళ్ళు వాళ్ళు నెత్తిమీద తంతే కుక్కపిల్లలా చెప్పినట్టు చేస్తారు ఏం లెక్కపెట్టక్కర్లేదు,'' అన్నాడు టైగర్ (సత్యనారాయణ).

''మరి, ఈ కుర్రాడ్ని వాళ్ళ కిచ్చేద్దామా?'' అన్నాడు ఆనంద్ (ప్రసాద్‌బాబు).

''చచ్చినా ఇవ్వొద్దు. పోలీసులకు చెప్పకురా- అంటే చెప్పాడు. అడుగడుగునా వాళ్ళు మనల్ని తరుముకొచ్చారు. వాడు తెలిసి చేసిన తప్పుకూ, నేను ఒప్పుకున్న మాటకూ చెల్లు. మళ్ళీ నేను చెప్పేవరకు ఈ కుర్రాడ్ని జాగ్రత్తగా చూడండి,'' అన్నాడు టైగర్.

కృష్ణ, జయప్రద నాయకా నాయికలుగా నటించే త్రిమూర్తి ప్రొడక్షన్స్ ''దొంగలవేట'' చిత్రానికి కె. ఎస్. ఆర్. దర్శకుడు. పి. బాబ్జీ, జి. సాంబశివరావు నిర్మాతలు.

### టి. కృష్ణ దర్శకత్వంలో కొత్త చిత్రం

రాజేష్ ఆర్ట్ పిక్చర్స్ పతాకంలో ప్యూజీ కలర్‌లో ఎం. నరసింహారావు నిర్మించే చిత్రానికి టి. కృష్ణ దర్శకుడు. జంధ్యాల రచన, మహదేవన్ సంగీతం ఉండే ఈ చిత్రం పాటల రికార్డింగ్ జూలైలో జరుగుతుంది. ఆగస్టు నెలలో షూటింగ్ ప్రారంభమవుతుంది.



కోయిలమ్మ కూసింది'లో వెంకటరత్నం నాయుడు, విజయరేఖ

# * జి. వి. జి. పేజీ *

**కుమారరాజా**

జైరాజ్ చొక్కా లేకుండా గద్దె మధ్యగా నిలబడి వున్నాడు. అతన్ని కొరడాతో ఓ భీకరాకారుడు కొడుతున్నాడు. ఒక్కో దెబ్బకు జైరాజ్ బాధతో వణికిపోతున్నా — తనను తాను నిగ్రహించుకుంటున్నాడు. అతనికి గడ్డం పెరిగి వుంది. చాలా మార్పు కనిపిస్తోందతనిలో. ఆ దృఢకాయుడు నాలుగుదెబ్బలు కొట్టాక ఆగడంతో "ఆపావేం? కొట్టు. నీ శక్తి అంతా ఉపయోగించి కొట్టు. కమాన్!" అన్నాడు. ఆ వ్యక్తి మళ్ళీ కొట్టసాగాడు. కిటికీలోంచి ఆ దృశ్యాన్ని చూసి నిర్ఘాంతపోయిన సుజాత "అంకుల్! అంకుల్!" అంటూ పరుగున వచ్చి తలుపు దబదబ బాదింది. తలుపు తియ్యమని జైరాజ్ చెప్పగా ఆ దృఢకాయుడు వెళ్ళి, గొళ్ళెం తీశాడు. సుజాత లోపలి కొస్తూనే "రాస్కెల్! మామయ్య ఉప్పూ పులుసూ తిని బలికేవాడివి — ఆయన్నే కొడతావా?" అంటూ లాగి ఆ దృఢకాయుని చెంపమీద కొట్టింది.

జైరాజ్ : సుజాతా! ఆగమ్మా! వాడి మీదెందుకు చెయ్యిచేసుకుంటున్నావ్? ఈ జీవిని ఇలా హింసించడానికే వాడికి జీతమిస్తున్నానమ్మా. అవునమ్మా (అంటూ ఆ దృఢకాయుని వంక తిరిగి) రాంసింగ్! అయామ్ సారీ ... వెళ్ళు ... సుజాతా! ఈ సంఘటన నా జీవితంలాగే చాలా విచిత్రంగా వుంది కదమ్మా? ఇనుమును శుద్ధి చేయడానికి కొలిమిలో కాల్చి, సుత్తితో కొడ్తారు పోలీసులకు పట్టిస్తావా? నీ రక్తం కళ్ళ జూస్తాను" అని కొట్టబోగా "రంగా! ఆగరా అగు!" అంటూ అతని తల్లి భయాందోళనతో లేచివచ్చింది. "నువ్వు తప్పుకోమ్మా! నేను జైలు కెళ్ళడానికి కారణం ఈ రాక్షసి. దీని అంతు చూస్తాను" అంటూ మళ్ళీ చెయ్యి ఎత్తగా "అగు!" అంటూ తల్లి అతన్ని కొట్టి, "రాజమ్మ అమ్మ తల్లిలాంటిదిరా. ఇన్నాళ్ళూ కన్నబిడ్డలా నాకు సేవలు చేస్తోంది. ఆ యమ్మమీద సెయ్యి సేసుకుంటావా?" అంది. రంగడు "అదంతా దొంగ నాటకమే. కొడుకుని జైల్లో తోయించి, తల్లికి సేవలు చేస్తోందా సేవలు! దీన్ని..."





'కటకటాల రుద్రయ్య'లో ఒక దృశ్యం

అంటూ రాజీని కొట్టడానికి చెయ్యెత్తినవాడల్లా "నువ్వేంటే మధ్య — తప్పుకో!" అంటూ ఆ ఆవేశంలో తల్లిని తోశాడు. "అమ్మా!" అంటూ గుండె పట్టుకుని తల్లి తూలిపడింది. రంగడు "అమ్మా!" అంటూ గాభరాగా తల్లి దగ్గరికొచ్చాడు. రాజి "అమ్మా!" అంటూ ఆమె తలను ఒడిలో పెట్టుకుంది. తల్లి ఆయాసంగా "ఒరే, రంగా! రాజమ్మని ఏమైనా అంటే పురుగులు పడిపోతావ్‌రా... తన మూలాన నువ్వు జైలు కెళ్ళావని — ఆ రోజు నుంచీ నన్ను కంటికి రెప్పలా సూసుకుంటూందిరా రాజమ్మ. కంటిమీద కునుకు లేకుండా నా పక్కన పడుండి సేవ చేస్తోందిరా పిచ్చి తల్లి... రాజమ్మా! నా కొడుకు తరపున నేను నీకు దణ్ణమెడుతున్నానమ్మా. ఆణ్ణి సెమించు... రంగా! దొంగతనం విడిచిపెట్టిరా— నిలువునా కాల్చేస్తుంది. నీతిగా బతకడం నేర్చుకోరా. దొరబాబులాటి బిడ్డను కన్నానని మురిసిపోయాను. దొంగతన్నాన్ని బాధతో యెళ్ళిపోతున్నాను. నిన్ను కన్నందుకు పక్కనుండి బాధపడ్డాను నేను పైనుంచయినా గర్వపడేలా బతకరా, రంగా!" అంటూ తుది నిశ్వాస వదిలింది. రాజీ, రంగడు ఆమెమీద పడి భోరున విలపించారు.

డి. ఎస్. ప్రకాశరావు కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి. వి. ఎస్. రాజు నిర్మించే విజయలక్ష్మి మూవీస్ 4వ చిత్రం "రంగా.రాజీ"లో రోజారమణి, మోహన్‌బాబు, అల్లు రామలింగయ్య, ప్రభాకరరెడ్డి, సారథి, హరిబాబు, కొండా శేషగిరి రావు, అశోక్‌కుమార్, జయమాలిని హాలం, అత్తిలి లక్ష్మి ఇతర పాత్రధారులు జంధ్యాల మాటలు, సత్యం సంగీతం, భాస్కరరావు ఛాయ, వెంకటరత్నం కూర్పు, భాస్కరరాజు శిల్పం, శంకర్—మదన్ సహకార దర్శకత్వం, శివరాజా నిర్వహణ గల ఈ వర్ణచిత్రం షూటింగ్ పూర్తిగా తిరుపతిలో జరుగులోంది.



**చాలా కాలం తర్వాత**

**ఎన్. టి. ఆర్ జానపదం**

ఇదీ అలాంటిదేనమ్మా ఆత్మశుద్ధి చేసుకోడానికి ఈ శరీరానికి ప్రాయశ్చిత్తం జరిపిస్తున్నాను.

సుజా ఈవేళ మీ పుట్టినరోజు, అంకుల్! ఆనందంగా గడపాల్సిన రోజున ఈ ప్రాయశ్చిత్తం ఏమిటి? ఇలా దెబ్బలుతిని బాధపడ్డమేమిటి?

జైరాజ్ నా జీవితంలో ఎదురైన మరపురాని సంఘటనలన్నీ ఈ పుట్టినరోజునాడే జరిగాయమ్మా నేనూ – నా భార్యా ఈరోజునే చేరువయ్యాం ఈరోజునే దూరమయ్యాం ఈ మనిషి నువ్వనుకునేంత మంచివాడు కాదమ్మా. నూరేళ్ళు నీడనిస్తాడని నమ్మిన ఆడదాన్ని ఎర్రటి ఎండలో ఎడారిలో వదల పారిపోయిన దుర్మార్గుడు నిండు గర్భిణి అయిన భార్యను కాలానికి, కర్మానికి వదలి దూరమైపోయిన దౌర్భాగ్యుడు ఒక్కో నేరానికి వందేసి కొరడాదెబ్బలు తిన్నా – ఈ పాపం కరిగిపోదమ్మా.. అసలు నా భార్యకి చేసిన ద్రోహానికి ప్రతిఫలంగా ఎప్పుడో మట్టిలో కలిసిపోవలసినవాడ్నమ్మా నేను. ఇంకా యిలా జీవచ్ఛవంలా బతికే వున్నానంటే – దానికి కారణం అరుగో.. ఆయనే

సుజా (జైరాజ్ చూపించిన ఫోటో వంక చూస్తూ) మా నాన్నగారా!

జైరాజ్ అవునమ్మా. వరదనీటిలా నిలకడలేకుండా తిరుగుతున్న నాకు పరిచయ మయ్యారు తనతో కాశ్మీర్ తీసుకొచ్చి, నాకు ఆశ్రయమిచ్చారు నీ బాధ్యతని, ఈ ఎస్టేట్ భారాన్ని నా చేతుల్లో పెట్టి కన్నుమూశారాయన. ఆ మహనీయుడికి నేనిచ్చిన మాటప్రకారం నిన్నో ఇంటిదాన్ని చేస్తే నా బాధ్యత తీరిపోతుందమ్మా ఆ తర్వాత నా పాపానికి ఆత్మాహుతి చేసుకున్నా – అది తక్కువ శిక్షే అవుతుంది

జైరాజ్‌గా కృష్ణ, సుజాతగా లత నటించిన సత్య చిత్ర వారి సినిమాస్కోప్ ఈస్ట్‌మన్ కలర్ చిత్రం ''కుమారరాజా''లో కృష్ణ త్రిపాత్రాభినయం విశేషాకర్షణ. సూర్యనారాయణ, సత్యనారాయణ నిర్మించే ఈ చిత్రానికి పి. సాంబశివరావు దర్శకుడు

### రిక్షా రాజీ

రంగడు (చంద్రమోహన్) దొంగతనం చేసినందువల్ల అతన్ని పోలీసులకు పట్టిస్తుంది రాజీ (జయచిత్ర) జబ్బున పడ్డ అతని తల్లి (నిర్మల) బాధ్యత తనే వహిస్తూ, సేవ చేస్తూ వుంటుంది. జైలునించి తిరిగివచ్చిన రంగడు ఇంట్లో రాజీని చూడగానే ఉగ్రుడయ్యాడు ''ఏమే! నన్ను



'పదహారేళ్ళ వయస్సు'లో శ్రీదేవి

ఎస్. డి లాల్ దర్శకత్వంలో ఎన్ టి ఆర్ జయప్రద, సి. ఎస్ రాజు భారీయెత్తున సినిమాస్కోప్‌లో నిర్మించే జయలక్ష్మి మూవీస్ ''రాజపుత్ర రహస్యము'' చిత్రానికి ఇటీవల కోయంబత్తూర్‌కు సమీపాన గల టాప్‌స్లిప్ వద్ద, కూరమ్మగా.. అన్నయానమలై అడవుల్లో ఎన్ టి ఆర్, జయప్రదలతో కొన్ని ముఖ్య సన్నివేశాలు చిత్రీకరించారు. ఇరవై ఏనుగులు కూడా ఈ షూటింగ్‌లో పాల్గొన్నాయి ఈ చిత్రంకోసం 23 సెట్స్ వేసినట్లు, ఏడులక్షల రూపాయల విలువగల 'స్టడీకామ్' కెమెరాతో విన్సెంట్ అద్భుతంగా షూట్ చేసినట్లు సి ఎస్ రాజు తెలియజేశారు జూలై చివరివారంలో విడుదలయ్యే ఈ చిత్రంలో యింకా జమున, బాలయ్య, సత్యనారాయణ, మోహన్ బాబు, కాంచన, పద్మాఖన్నా, పుష్పలత, జయమాలిని, హలం నటించారు గొల్లపూడి రచన, మహదేవన్ సంగీతం, బి చలం – వాలి శిల్పం, కోటగిరి గోపాలరావు కూర్పు గల ఈ చిత్రం వై. నాయుడమ్మ సమర్పణ

### ఒకే షెడ్యూల్‌లో పూర్తయిన "ప్రాణం ఖరీదు"

రాజమండ్రికి 10 మైళ్ళ దూరంలో ఉన్న పొట్టిలంక గ్రామంలో ఒకే షెడ్యూల్‌లో పూర్తయిన శ్రీ అన్నపూర్ణ ఎంటర్ ప్రైజెస్ ''ప్రాణం ఖరీదు'' చిత్రంలో చంద్రమోహన్, జయసుధ, రావు గోపాలరావు, సత్యనారాయణ, చలం, గిరిబాబు, మాధవి, రమాప్రభ, కొత్త నటీనటులు రేష్మి, చిరంజీవి పాల్గొన్నారు విశిష్టమైన, వినూత్నమైన ఈ ఇతివృత్తానికి క్రాంతికుమార్ నిర్మాత కె వాసు దర్శకుడు. లోకనాథ్ ఛాయాగ్రాహకుడు, హేమచందర్ శిల్ప దర్శకుడు రావిసూరి–ప్రేమకుమార్ సహకార దర్శకులు, చక్రవర్తి సంగీత దర్శకుడు

### అంతులేని వింతకథ

మోహన్ దాస్ రచన, దర్శకత్వంలో కె. రాఘవ నిర్మించే ప్రతాప్ ఆర్ట్స్ ''అంతులేని వింత కథ'' చిత్రంలో సత్యనారాయణ, శ్రీవిద్య, జయంతి–ముఖ్య పాత్రధారులు. ఇన్‌డోర్ షూటింగ్ భాగ్యనగర్ స్టూడియోస్‌లో, ఔట్‌డోర్ షూటింగ్ విశాఖ పరిసర ప్రాంతాలలో జరుగుతాయి



'స్వర్గసీమ'లో ప్రభ



'సుడిగాలి జీవితాలు'లో రాజా, రోజా





'రాముడు—రంగడు'లో కృష్ణంరాజు, చంద్రకళ

# జి. వి. జి. పే జీ

## మగవారంటే గిట్టని జయమాలిని

కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో డాక్టర్ డి. వి. ఎస్. రాజు నిర్మిస్తున్న భారీ సినిమాస్కోప్ వర్ణచిత్రం ''సింహబలుడు''లో ఒక తెగవారి రాణిగా జయమాలిని కొత్త పాత్రలో కనిపిస్తుంది. మగబానిసల కేంప్‌కు అధికారిణిగా ఉన్న ఈమెకు మగవారంటే గిట్టదు. వారిని నానావిధాల హింసిస్తుంది. ఆ కేంప్‌కు కథానాయకుడు బానిసగా ప్రవేశిస్తాడు. అతని సాహసకృత్యాలకు మంత్రముగ్ధవలె ఆకర్షింపబడుతుంది. ఆమె బారినుండి బానిసలను హీరో వీరోచితంగా విడిపించే సన్నివేశాలు బెంగళూరుకు 30 మైళ్ళలో ఉన్న రామ్‌నగర్‌లో చిత్రీకరింపబడ్డాయి. అక్కడే హీరో ఎన్. టి. ఆర్. జన్మదినోత్సవాన్ని మే 28న తిరుపతి ప్రొడక్షన్స్ అధినేత డి. శ్రీరంగరాజు ఘనంగా జరిపారు. జూలై 3 వరకు జరిగే షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తవుతుంది. ఆగస్ట్ రెండవ వారంలో విడుదల. వాణిశ్రీ నాయిక. డి. వి. నరసరాజు రచన, ఎం. ఎస్. విశ్వనాథం సంగీతం, కన్నప్ప ఛాయ. మార్తాండ్ కూర్పు, వేటూరి గీతాలు, భాస్కరరాజు శిల్పం, సలీమ్ నృత్యాలు, వి. కోదండరామిరెడ్డి—సరిపెల్ల చిట్టిబాబు సహకార దర్శకత్వం, దాట్ల బలరామరాజు, ఆర్. విజయరామరాజు నిర్వహణ గల ఈ చిత్రానికి జి. సత్తిరాజు ప్రొడక్షన్ కంట్రోలర్.

## సీతాపతి సంసారం

ఆఫీసులో ఉద్యోగంచేసే భర్త, ఇంట్లో వంట పని చేసే భార్య అనుకోకుండా తమ తమ పదవులను మార్చుకొని, కొన్నాళ్ళు కాలచక్రంలో తిరిగినవాడు — మాట విలువ, మనిషి మనుగడ బోధపడుతుంది. ఎవరి వ్యాపకం వారు సక్రమంగా నిర్వహించినవాడు జీవితం మూడు పువ్వులు - ఆరు కాయలుగా విలసిల్లుతుంది. అపార్థాలకు భార్యాభర్తలు లొంగిపోయినవాడు పట్టాలు తప్పిన రైలులా సంసారం నవ్వులపాలవుతుందని చాటి చెప్తుంది ''సీతాపతి సంసారం'' చిత్రం అంటూ తెలియజేశారు ఈ చిత్రాన్ని సమర్పించే ఎం. రామకృష్ణారెడ్డి. శ్రీ రామకృష్ణా కంబైన్స్ పతాకంలో భాగ్యనగర్ స్టూడియోస్‌లో ఎం. సుబ్బరామరెడ్డి, -కె. శంకరరెడ్డి నిర్మించిన ఈ చిత్రానికి ఎం. ఎస్. కోటారెడ్డి దర్శకుడు. చంద్రమోహన్, ప్రభ, నరసింహరాజు, మాధవి, అల్లురామలింగయ్య, ప్రవీణ, షూడా, గిరిజ, విజయవాణి, జయమోహన్, చక్రవర్తి, జయభాస్కర్ నటవర్గం. జంధ్యాల, చక్రవర్తి, పి. భాస్కరరావు, నరసింహారావు, భాస్కరరాజు, జగన్మోహనరావు, రావుశ్రీ సాంకేతికవర్గం. జూలైలో విడుదలకు సిద్ధమవుతుంది. ✪



'తుఫాన్ మెయిల్'లో ప్రభాకరరెడ్డి

# ఈ 8 కారణాలకోసం...

























# భారతపు ప్రథమ ప్రెషర్ కుకర్
# నేడు కూడా విపులంగా
# ఉపయోగింపబడుతున్నది



**Prestige**

ప్రెస్టీజ్
టి టి. (ప్రైవేట్) లి.
బెంగళూరు–560 016

MCA/TT/50-Tel



)( )( )( )( )( 'అల్లరి పిల్లలు'లో ఒక దృశ్యం )( )( )( )( )(

# సినిమా విశేషాలు

## ''ఎన్టీఆర్''ది శుక్రదశ?

డాక్టర్ ఎన్టీరామారావుగారికి 'శుక్రదశ'' నాబోలు! అందుకనే, ఆయన చిత్రాలంటే ప్రేక్షకులు అత్యధిక ఉత్సాహాన్ని చూపెడుతున్నారు ఆయన చిత్రాలు సృష్టించిన చరిత్రను, మరెవ్వరి చిత్రాలు అధిగమించలేవు మళ్ళీ, ఆయన నటించిన చిత్రమే చెయ్యా

శ్రీ ఎన్టీఆర్ తెరపై కనిపిస్తే చాలు థియేటర్లో నిండిన ప్రేక్షకులు ఆనంద కరతాళధ్వనులు చేస్తారు అంతటి వైభవం శ్రీ ఎన్టీఆర్‌కు మాత్రమే దక్కింది

ఇప్పుడు ''గ్లామర్ హీరో'' ఎవరు అని ప్రశ్నిస్తే ... శ్రీ ఎన్టీఆర్ అనేది రిప్లై ఎవర్ని అడిగినా వస్తుంది.

ఆంధ్రదేశం నుంచి వచ్చే ''టూరిస్టు బస్సులు'' అరవైమూడు, బజార్లా రోడ్డు దగ్గర బారులుతీరి ''హాల్ట్'' అవుతాయి ఆ దివ్యమంగళ విగ్రహాన్ని కొద్దినిమిషాలు చూసి వెళ్లడం టూరిస్టులకు అలవాటు, మరి ఆ ముఖంలో ఏదో ''ఆకర్షణశక్తి'' వుంది ఆ ''శక్తి'' ఆయన విజయ పరంపరలకు కారణమేమో అనిపిస్తుంది

శ్రీ ఎన్టీఆర్ కథానాయకుడు అని పత్రికల్లో ప్రకటిస్తే చాలు ఆ చిత్రాన్ని కొనడానికి ''క్యూ''లో వస్తారు అంత ''క్రేజు'' తెలుగు హీరోలలో మరెవ్వరికీ లేదేమో!

వృత్తిని తపస్సుగా ధ్యానించడం, విరోధులకు కూడా ఉపకారం చెయ్యడం శ్రీ ఎన్టీఆర్ ప్రత్యేక లక్షణాలు

శ్రీ ఎన్టీఆర్ ఫలానా పాత్రకయితేనే న్యాయం చెయ్యగలరు అని ఎవ్వరూ తప్పు అంచనా వెయ్యరు ఆయన పేదవాడుగా ఎంత రాణిస్తారో కోటీశ్వరుడుగా అంత హుందాతనాన్ని ప్రదర్శిస్తారు కర్షకుడుగా, కార్మికుడుగా ఎంత చక్కగా నటిస్తారో కామందుగా, యజమానిగ అంత మెప్పించగలరు రాజ్యమేలే మహారాజుగా, పురాణ పాత్రలకు ప్రతిరూపంగా శ్రీ ఎన్టీఆర్ ప్రశంసనీయంగా నటిస్తారు అన్నీ చెయ్యగల సమర్థతతోబాటు దేవుడిచ్చిన సుందరరూపం శ్రీ ఎన్టీఆర్‌కు వుంది

తెలుగు చిత్ర పరిశ్రమ పచ్చగా వర్థిల్లడాని-

'ప్రాణం ఖరీదు'లో రేష్మి



ఎన్టీఆర్‌గారి చిత్రాలు చాలవరకు దోహదం చేస్తున్నాయి

ప్రజాబలం వున్న కథానాయకుడు ప్రజల శ్రేయస్సును కాంక్షించే కథానాయకుడు ప్రజలు కాంక్షించే పాత్రలను పోషిస్తున్న కథానాయకుడు ఎన్టీఆర్‌గారే

### ఎన్టీఆర్ చిత్రాలలో వైవిధ్యం

''కళాప్రపూర్ణ'' శ్రీ ఎన్టీఆర్ ప్రస్తుతం నటిస్తున్న చిత్రాలను పరిశీలిస్తే ,. ఒక పాత్రకు మరొదానికి యిసుమంత సామ్యం కనిపించదు ఆయన చిత్రాలలోని వైవిధ్యం కూడా విజయానికి బలీయమైన కారణమేమో!

### యుగపురుషుడు

వైజయంతీ మూవీస్ నిర్మించిన 'యుగపురుషుడు'' చిత్రం యువతరాన్ని ఆకర్షించే, మత్తెక్కించే అంశాలను గొనియుండడం వల్ల ఆ చిత్రానికి నూరురోజుల వైభవం గ్యారంటీ అశ్వినీదత్‌గారికి మలి విజయాన్ని, బాపయ్యగారికి ఎన్టీఆర్‌గారితో రెండో విజయాన్ని తెచ్చిపెడుతుంది శ్రీ ఎన్టీఆర్ కుమారి జయప్రదల శృంగార సన్నివేశాలు కొత్తతరహాలో వుండడం ''యుగపురుషుడు'' చిత్రంలోని ప్రత్యేకత

### రాజపుత్ర రహస్యం

శ్రీ ఎన్టీఆర్ ''టార్జాన్''గా నటించడం 'రాజపుత్ర రహస్యం'' చిత్ర విజయానికి ముఖ్య కారణం అని పేర్కొనవచ్చు శ్రీమతి జమున పాత్ర పోషణ మరో జనాకర్షణీయ అంశంగా పేర్కొనాలి కుమారి జయప్రద లావణ్యం, శ్రీ రామారావు అమెతో జరిపిన శృంగారం ''రాజపుత్ర రహస్యం'' చిత్రానికి శుభయోగాన్ని తెచ్చే అయిటమ్స్ నిర్మాతలు సి ఎస్ రాజా లక్ష్మయ్యచౌదరిగార్లు 'షీల్డు''కోసం యిప్పుడే ఆర్డరివ్వాలి ఎన్టీఆర్ ఎస్ డి లాల్ గార్లకు ఈ చిత్రం అయిదవ విజయం అవుతుంది

### ''సింహబలుడు''

శ్రీ ఎన్టీఆర్ శ్రీ రాఘవేంద్రరావు కాంబినేషన్‌లో రానున్న రమణీయ చిత్రమే ''సింహబలుడు'' లోగడ వచ్చిన జానపదాలకు, దీనికి నదికి సముద్రానికి వున్నంత తారతమ్యం వుంది ''అగ్రనటి'' వాణిశ్రీ కొత్తతరహా పాత్ర-పోషణ ''సింహబలుడు'' చిత్రానికి యస్సెట్ కాగలదు నిర్మాతలు డి వి ఎస్ రాజు, శ్రీరంగరాజుగార్లకు 'సింహబలుడు'' ధనబలుడు కావడం తథ్యము

### ''సాహసవంతుడు''

విదేశంలో అర్థభాగం, స్వదేశంలో అర్థభాగం సాహసవంతుడు' చిత్రంలోని ప్రత్యేక అంశం శ్రీ ఎన్టీఆర్, కుమారి వాణిశ్రీలతోబాటు, నేపాల్ నటి శ్రేష్ఠ ముఖ్య పాత్రను పోషించడం యీ చిత్రంలోని ప్రత్యేకత నిర్మాత శ్రీ విద్యాసాగర్‌కు తొలి చిత్రమే అసాధారణ విజయాన్ని తెచ్చిపెట్టే విధంగా, దర్శకుడు శ్రీ బాపయ్య కృషి చేస్తున్నారు

# జమున చెప్పిన నిజాలు

చలనచిత్ర రంగంలో కథానాయికగా ప్రవేశించి, ఒక్కొక్క మెట్టును అధిరోహించిన అగ్రశ్రేణి నటి శ్రీమతి జమున, యిప్పటికీ ''ఎవర్‌గ్రీన్''గా తను రాణించడం ఆమెకు దేవుడిచ్చిన వరం అనే చెప్పాలి

ఇరవై అయిదేండ్ల సినిమా జీవిత వైభవాన్ని చవిచూచిన, ''కళాభారతి''కి యిప్పడున్న పరిస్థితులు సంతృప్తికరంగా ఆరోగ్యకరంగా లేవు

''పెద్దలపట్ల పూజ్యభావం, వృత్తిపై మమకారం, పాత్రపై శ్రద్ధ ఆ రోజుల్లో మేము అలవాటు చేసుకున్నాం కానీ, యీ రోజుల్లో అవన్నీ కరువయ్యాయి అధిక ప్రసంగతనం అన్నీ తెలుసన్న అహంకార భావం చాలామందిని ఆవహించాయి'', అన్నారు జమున

ఆ రోజుల్లో నేను, సావిత్రి, అంజలీదేవి, కృష్ణకుమారి, షావుకారు జానకి పరస్పరం ప్రేమించుకునేవాళ్ళం మా పాత్ర పోషణలోని మంచి... చెడులను గూర్చి చర్చించుకునేవాళ్ళం ఈర్ష్యాద్వేషాలను అసహ్యించుకునేవాళ్ళం అందుకే, మంచి చిత్రాలు మాకు మంచి పాత్రలు వచ్చాయి.

ఈ రోజుల్లో వెలుగొందుతున్న కొందరు, ''నటన''లో ''సున్న'' అయినా, పోజుల్లో మిన్నగా ప్రవర్తిస్తున్నారు సంఘీభావమో బాగా చెయ్యాలన్న వున్నత భావమో బహు కొద్దిమందిలో మాత్రమే కనిపిస్తున్నది'', అని నేడున్న పరిస్థితిపట్ల, ''కళాభారతి'' తన బాధను వ్యక్తపరచింది

## అమ్మ పాత్రలపై అభిప్రాయం

కొందరు ''అమ్మ'' పాత్రలు వెయ్యమని అడుగుతున్నారని, మీరు చెయ్యను అని చెప్పేసారని పరిశ్రమలో వ్యాపించిన వార్తపై జమున చెప్పిన సమాధానం ఎంతో సమంజసంగా వుంది

''బంగారు తల్లి చిత్రంలో అమ్మ పాత్ర పోషించలేదా! మనుషులంతా ఒక్కటే చిత్రంలో శ్రీ ఎన్టీఆర్‌కు తల్లిగా నటించలేదా! మా యింటి మహాలక్ష్మి చిత్రంలో తల్లి పాత్రను పోషించలేదా! అలాంటి ''అమ్మ'' పాత్రలయితేనే చేస్తాను అని అనడం తప్పా?'' అంది జమున

## మంచి పాత్రలకే అంగీకారం

''ఇకపై నేను సంవత్సరానికి మూడు నాలుగు మంచి పాత్రలను మాత్రమే పోషిస్తాను'', అన్నారు జమున

## రాబోయే వెరైటీ పాత్రలు

జయలక్ష్మి మూవీస్ నిర్మించిన ''రాజపుత్ర రహస్యం''లోని పాత్రకు, శ్రీ దాసరి చిత్రీకరణలో రూపొందిన ''రుద్రయ్య''లోని పాత్రకు, శ్రీ ఎన్టీఆర్ రూపకల్పనలో నటించిన మండోదరి పాత్రకు ఎంత వైవిధ్యం వుందో ప్రేక్షకులు నిండు మనసుతో మెచ్చగలరు, అంది, జమున

## అభిమానుల కోరిక

''కళాభారతి'' జమునగారిని, అభిమానులు ''అమ్మ'' పాత్రలలో చూడడానికి అయిష్టంగా వున్నారని, ఆమెకొచ్చే వుత్తరాలు తెలుపుతున్నాయి. 'ఎవర్‌గ్రీన్''గా కనిపించే ఆమెను, ప్రత్యేకత గలిగిన విశిష్టమైన పాత్రలలో చూడాలన్నదే, ఆమెను అభిమానించే ప్రేక్షకుల కోరిక

## నాటకానికి ప్రశంస

శ్రీమతి జమున ప్రదర్శిస్తున్న ''కృష్ణ తులాభారం'' నాటకానికి ప్రేక్షకుల అమోఘ ఆదరణ లభిస్తున్నది నిజంగాబట్టే అనేక కేంద్రాల నుంచి ఆఫర్లు వస్తున్నాయి

ఒక వ్యక్తి సంపాదించడంతో సరిపెట్టుకుంటే ఆ జీవితానికి ''ధనవంతుడు'' అని మాత్రమే పేరు వస్తుంది సంపాదనలో కొంత శాతం ప్రయోజనకర కార్యాలకు సద్వినియోగం చేస్తే ఆ వ్యక్తి జీవితానికి ఒక అర్థము పరమార్థము లభిస్తుంది అనేది వున్నత భావం జమునగారికి వున్నది గాబట్టే వృద్ధ కళాకారులకు సహాయం చేసే యజ్ఞాన్ని నిర్విఘ్నంగా కొనసాగిస్తున్నది

తెలుగు చిత్ర రంగంలో ''హీరోయిజమ్'' వున్న ఏకైక కథానాయికగా జమునగారిని పేర్కొనాలి

పరిశుద్ధమైన మనస్సు గల విదుషీమణి గాబట్టే జమున ''ఎవర్‌గ్రీన్''గా వుండగలుగుతూంది [34వ పేజీ చూడండి]



'రాజపుత్ర రహస్యం' 

 'ప్రేమ–పగ'



# మమ్మీ ! మమ్మీ ! 'మాడ్రన్' స్కూల్ !

జనాలు కొందరు దొంగతనాలు, దోపిళ్లు ఎందుకు చేస్తున్నారు ? ఈ కాలంలో కూడా నాటి అవసరం వుందా ? అని — పైగా రైలుబండ్లలో దొరబడి — అచ్చం సినిమాలో దొంగలమురా దోపిడీ చేసినట్లు దోపిడీ చెయ్యడం ఎందుకు ? ఎందుకేమిటి ? — వీరరసపోషణకోసం — సాహస ధైర్యాలను రుజూ చేసుకుందుకోసం — సినిమాలను చూసి నేర్చుకున్న విద్యని పనికొస్తుందా ? రాదా? అని ఓసారి పరీక్షించి చూసుకోడంకోసం — లేకపోతే దొంగతనం, దోపిడీలు ఎందుకు ? — హాయిగా ఓ ఇంగ్లీషు మీడియం ఎలిమెంటరీ స్కూలు పెట్టవచ్చును — లేదా మగతనముంటే నాలుగు రోడ్ల జంక్షన్‌లో మిరపకాయబజ్జీలు కొట్టు పెట్టవచ్చును — అందులో ఆమ్లెట్‌లు కూడా తాజాగా చేసి అమ్మవచ్చును .. యిలాంటి దోపిడీ చెయ్యడానికి అవకాశాలు ఎన్నో వుండగా - కిటికీ వూచలు వొంచి — గోడకి కన్నంవేసి — రైలుబండి టాపుమీది నుంచి 'కంత' చేసుకుని లోపలికి దూకి యిన్ని అవస్థలుపడి — పోలీసులకి— దోచుకున్నది సగం మేపి — చివరికి జైల్లో పండివిసరడం ఎందుకు ?

కొంచెం డొక్కశుద్ధి వుంటే చాలు ఒక ప్రెస్సుకుపోయి ఓ రెండురకాల కరపత్రాలు అచ్చ వేయించడం — ఇంగ్లీషు తరగతులు పెడుతున్నాం — అప్లికేషను కావలసినవాళ్లు ఓ ఐదురూపాయిలు కట్టి తీసుకోండి - మీ అదృష్టం పరీక్షించుకోండి — సీట్లు కొంచెమే వున్నాయి — త్వరపడండి అని ప్రకటన వేస్తే చాలు — బొడ్డూడని పిల్లల్ని తీసుకుని కాస్త చదువుకున్న తల్లులు — క్యూలో నిలబడి బ్రతిమాలుతూ — ప్రాధేయపడుతూవుంటారు - మావాణ్ని మ్యునిసిపల్ స్కూలుకి పంపలేమండీ తెనుగు మీడియం స్కూలు కూడా పంపలేమండీ ఎందుకంటే — వాళ్ల నాన్నగారు యింగిలీషుకే బోలెడు వ్యూచరుంది అంటున్నారు — అంటూ అప్లికేషను తీసుకుపోయి — నిరుద్యోగప్రుషులు ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజీల చుట్టూ ఇంటర్వ్యూల కోసం ఎగబడ్డట్లు — ఎగబడతారు తల్లులు.

తండ్రులు సాధార్నంగా రారు ఎందుకంటే ప్రొద్దున్నే ఆఫీసుకు పోయి సాయింకాలందాకా యిల్లూ వాకిలీ మరిచి - పని చేసుకుని — అలసి కొంపకి చేరే పక్షులే — తమ పిల్లల్ని ఇంగ్లీషు మీడియమ్ స్కూలులో పెట్టాలని గొప్ప యిదై పోతుంటారు.

## సామాన్యుని | సణుగుడు

''మీవాడికి స్టాండర్డ్ లేదండీ ఏబిసిడీలన్నీ రాలేదు — కె. జి లో పడేయండి'' అంటుంది ఇంగ్లీషు మీడియం స్కూలున్న యిరుకు గదిలో చెమటలుక్రక్కుతూ కూర్చున్న హెచ్‌యమ్‌గారు

''అమ్మమ్మ ! అలా అనకండి ! మేం యింటి దగ్గర కోచ్ చేస్తాంగా దయచేసి మావాణ్ని సెకన్డ్‌లో వేసుకోండి — ఎందుకంటే మా ఇంటి ప్రక్క నున్న రాంభాణమ్మగారి వాళ్ళ వెధవకి 'సి అనడం కూడా రాదు - ''చి'' అంటాడు వాణ్ని షెక్స్‌పియర్ హై యింగ్లీషు మీడియమ్ టాప్ ఎలిమెంటరీ స్కూల్లో - థర్డ్‌లో వేయించేశారు వాళ్ల 'బాబు' - అంటుంది తల్లి -

''మీరేమైనా చదువుకున్నారా ? ఏదైనా జాబ్ చేస్తున్నారా ?'' ఇంగ్లీష్ ప్రిన్సిపాల్ గర్వంగా చూస్తూ ప్రశ్న - ''ఏదో చదువుకున్నానండీ బి ఏ ఎకానామిక్సు మా ఆయన కెమిస్ట్రీలో పోస్టుగ్రాజువేటు — మేం చెబుతాంలెండి యింటి దగ్గర'' యిలా — బ్రతిమాలి చివరికి ఆ ఇల్లాలు

'సాహసవంతుడు'లో ఎన్.టి.ఆర్., కుమారి శోభాగురుంగ్



ఓ అర్ధశతం సమర్పించుకుని కుర్రాణ్ని ఒకటో క్లాసు లేదా రెండో క్లాసులో పడేసి — రిక్షాబండి వాణ్ని, ఆయాని, వాచ్ మ్యాన్ ని అందర్నీ— 'కాకా' పట్టి ఇల్లు చేరుకుంటుంది — "ఎవరెస్ట్" ఎక్కిదిగినట్లు !

మర్నాడు కుర్రవాడు లిస్టు తెస్తాడు — "అమ్మయ్యో" అని గుండెలమీద చెయ్యి వేసుకుంటుంది — నేను ఎస్సెల్సీ చదువుకున్నప్పుడు కూడా యిన్ని నోట్ బుక్స్ లేవూ" అని — కాని — పరువుతక్కువే — బయటికి చెప్పదు. అందుకని— అవన్నీ కొంటుంది — మొగుడికి తెలీకుండా దాచుకున్న పాతికరూపాయిలు కూడా ఐపోతాయి ! వారంరోజు లయ్యేసరికి "మమ్మీ" "డాడీ"గాడు యింటికొస్తాడు — "హోమ్ వర్క్' చెయ్యి మమ్మీ" — అంటాడు. చదువుకుందికదా — అందుకని వాడి హోమ్ వర్క్ చెయ్యడం మొదలెడతుంది ! — వారం తిరిగేసరికి కొన్ని ఎక్సర్ సైజు బుక్స్ అన్నీ ఐపోలాయి — "కాస్త నీర్సంగా వుంటోందండీ ! — "విటమిన్ టాబ్స్" ఏమైనా తెస్తారేమిటి ?" అంటుంది మొగుడితో — రాత్రి ఆవలిస్తూ ... ఎందుకుటా ఈ నీర్సం ? చంటాడి హోమ్ వర్క్ చేయించడం వల్ల — తండ్రి విసుక్కుంటాడు — నెలకి ఇరవై "..." బళ్లో 6 గంటలు ఏం చేస్తారుటా ! ? ఏం చెప్తారా ? పిల్లకి వెధవది బండెడు హోమ్ వర్క్ యిస్తారు — కుర్రవెధవలు ఆడుకోడం అక్కర్లేదా ?" అని భార్యమీద ధాంధూం చేస్తాడు — "ఏమోమరి ! పోయి రేపు అడగండి— ఆ స్కూళ్లో కూచుందికే చోటు చాలదు ఆటలేం ఆడిస్తారు ? యిద్దరు దొరసానమ్మల్ని కూడా వేశారు స్కూల్లో—" అంటుంది ఇల్లాలు. ఆ భర్త వెళ్లడు ... అడగడు — "సరిలే" అని తాను కూడా హోంవర్క్ చెయ్యడానికి కూర్చుంటాడు "ఒప్పుకున్నాంగా .. యింట్లో కోచింగ్ యిస్తామనీ" అని భార్యాభర్తలిద్దరూ కూడా తంటాలుపడతారు — యింతకీ స్కూల్లో 6 గంటలసేపు ఈ పిల్లకాయిలకి వాళ్లు నేర్పేది ఏమిటీ ? "సిట్ డవున్"లు — "యస్ టీచర్"— "నో టీచర్" మాటలు — ఇంతేనా ? పోన్లెండి— ఈ మ్యునిసిపల్ స్కూలుకి వెళ్తే పచ్చిబూతులు నేర్చుకుంటారు — ఆ బాధ లేదు నీటుగా వున్నారు" అంటుంది తల్లి కాని ఆ కుర్రవాడు— తెనుగు సినిమా చూసి తెనుగులో "యువర్ మదర్", "యువర్ సిస్టర్" లాంటి ఊతపదాలు జున్నంగా నేర్చేసుకుంటాడు. [ఆటలు రావుకాని] నెలాఖర్న యీ ఇంగ్లీషు మీడియం "కిండర్ గార్టన్" ఖరీదు అరవై నుంచి ఓ ఎన్పైనోటుదాకా ఎంతైనా వుంటుంది...పైగా "ఏం స్కూలమ్మా మీ పిల్లాడిది?" — అంటే 'కాన్వెంట్' అంటుంది ఎంత గర్వంగా — కాని యీ "కాన్వెంట్"లో "సన్యాసిను"లు సన్యాసులు వుండరు — ఇదో రకం "దోపిడి మఠం" అన్నమాట ! — మిరపకాయి బజ్జీల బండ్ల కథ మరోసారి.

/ వీరాజీ /

## మోహన రూప

[23 వ పేజీ తరువాయి]

"ఊం" ముఖం ఎర్రగా చేసుకుని వెళ్లిపోయింది అక్కడున్న కొందరు అధికారులను, ప్రభుత్వ ఆస్పత్రి సిబ్బందిని ఆహ్వానించారు వాళ్లంతా వచ్చి కూర్చున్నారు. వాళ్ల సమయము పాడుచేయకూడదని లత అభిప్రాయం.

కార్యక్రమము ఇంద్రమోహన్ నిర్వహించాడు అక్కడి ప్రాజెక్ట్ ఇంజనీరుగారు అధ్యక్షత వహించారు ప్రభుత్వ డాక్టరు శుభాకాంక్షలు అందజేశారు. తాతయ్య ప్రారంభోత్సవం చేశారు రూపాదేవి తన చేతిమీదుగా అతిధులకు పూల గుత్తులు సమర్పించింది తాతగార్కి పూలగుత్తి ఇచ్చి పాదాభి వందనం చేసింది ఆయన తన ఆశయం ఏమిటో వివరించారు.

"చిరంజీవి రూప నా మనుమరాలని కాదు వ్యక్తిగా ఓ గొప్ప యువతి. డిగ్రీ చేతికి రాగానే పరదేశాలకు వెళ్లాలనుకునే ఈ కాలంలో, ఈ ఊరిలో నా కోర్కెమేరకు నర్సింగ్ హోమ్ ప్రారంభించింది ఆ పని నా చేతుల మీదుగా జరుగాలని కోరుకుంది ఆమెకు మీ అందరి సేవా భాగ్యం లభించాలని, మానవ జన్మ యెత్తినందుకు సార్ధకతలభించాలని కోరుతూ, నిండు మనసుతో ఆమెను ఆశీర్వదిస్తూ, మీ సహాయ, సహకారాలు ఆమె కందజేయమని కోరుతున్నాను..." చప్పట్లు శబ్దంతో హాలు మార్మోగింది.

ఆ తరువాత కొందరు ఆదర్శ వైద్యగృహం యెలా ఉండాలో చెప్పారు.

ఉపన్యాసాలు అవుతున్నాయి.

"రూపాదేవి గారూ ! స్వీట్స్ విశ్వం చేత పంచిపెట్టించాలని అనుకున్నాము కదా. ఇప్పుడెలా ?"

"యెలా ఏముంది ? మీరే పంచిపెట్టండి" అన్నది, ఆలస్యం అయిన బస్సును తిట్టుకుంటూ రూపాదేవి పెద్దలను సాగనంపుతుంది. మిఠాయి పంచే దగ్గర తీసుకున్నవారే మళ్లీ, మళ్లీ అడుగుతున్నారు ఆమె నవ్వుకుంది.

విశ్వం, శోభన్ ఇద్దరూ వచ్చారు.

"సారీ విశ్వం ! అందరూ వచ్చేశారు. ఒక్కరి కోసం అందరిని ఆపడం న్యాయం కాదని మీ మిత్రుడు అన్నాడు."

"చాలా మంచిపని చేశారు. అందరి ముందు నేను దోషిగా నిలబడే పరిస్థితి నుండి తప్పించారు."

"నన్ను ఓట్ ఆఫ్ థాంక్స్ చెప్పమన్నాడు డాక్టరు గారూ !" శోభన్ అన్నాడు కంగారుగా.

"మీ వంతు ఓట్ ఆఫ్ థాంక్స్, విశ్వం వంతు పనులు అన్నీ తనే చేస్తున్నాడు, పాపం." ఇంద్రను చూపింది.

"మేం వాడికి కాలేజిలో పేరు పెట్టాంలే పేక ముక్కలో జోకరని..." అన్నాడు

"రండి, రండి తాతయ్య చిన్నప్పుడు యెప్పుడో చూచాడట. మిమ్మల్ని చూడాలను కుంటున్నాడు"

ఆమె తీసుకు వెళ్లి పరిచయం చేసింది, తాతయ్యకు

"తప్పదియ్యా ! అసలు హీరోవి నువ్వన్న మాట. మీ తాతయ్య బ్రతికి ఉన్న రోజులలో, యెంత స్నేహమని. ఇంట్లో కాస్త పని ఎక్కువయితే చాలు పరుగెత్తుకువచ్చేవాడు. ఆ కాలమే వేరు ఆ ఆప్యాయతలే వేరు." ఆప్యాయంగా విశ్వం భుజం తట్టాడు ఆయన చెమట తుడుచుకుంటూ లడ్డూలబుట్ట పట్టుకుని వచ్చాడు ఇంద్రమోహన్ ఏదో మాట్లాడాలని నోరు విప్పిన విశ్వం నోట్లో ఓ లడ్డు కుక్కాడు. మరోటి చేతికిచ్చి రూపాదేవిని చూపాడు

విశ్వం ఏం అర్ధం కాక నోట్లో లడ్డు తినేశాడు. తాతగారు చప్పట్లు కొట్టి నవ్వారు.

"ఇది కూడా దేనికి ?" చేతిలోని లడ్డు చూపాడు.

"గుటుక్కున మింగడానికి. ఒర్రి ట్యూబ్ లైట్ బుర్ర. రూపాదేవికి ."

"ఓ...ఐసీ ." విశ్వం కాస్త సిగ్గుపడ్డాడు.

"యు...సీ...చూస్తూనే ఉన్నాను. కనీసం తాతయ్యకు నమస్కారం అయినా పెట్టావా !"

"మనలో మనకు ఏమిటయ్యా మర్యాదలు ! ముగ్గురు చాకులాంటి కుర్రాళ్లు ! మరో ఇద్దరు మనవరాళ్లుంటే బాగుండును అనిపిస్తుంది."

"హతోస్మి ! తాతయ్యా, రక్షమాం..." నవ్వాడు ఇంద్రమోహన్.

"ఏమయ్యా నా మనవరాలు అంత భయంకరంగా ఉందా !"

"అది కాదు తాతయ్యా ! రూపాదేవిలాంటి విలక్షణమైన వ్యక్తిత్వం గల స్త్రీలను భరించటం మాలాంటి వారికి కష్టమే."

"అయ్యా ! ఇంద్రమోహన్ గారూ ! కబుర్లతో కడుపు నిండదు ఫలహారం చేద్దాం రండి..."

"ఆ ఏర్పాటు జరిగింది మేడమ్..."

అందరూ అతడిని అనుసరించారు. పేషెంట్లకోసం వెయిటింగ్ రూమ్ కట్టారు. అందులో ఉపాహారానికి ఏర్పాట్లు జరిగాయి తాతయ్యతో పాటు అందరూ కూర్చున్నారు.

"రూపా !"

"ఏం తాతయ్యా !" అని దగ్గరగా వచ్చింది.

"ఈ ఇంద్రమోహన్ ఉద్దండ పిండంలా ఉన్నాడు నర్సింగ్ హోమ్ ప్రారంభోత్సవంలో ఘనంగా సన్మానించాలి."

"కర్రతోనా తాతయ్య" నవ్వాడు విశ్వం అందరూ కూర్చొని ఫలహారం చేశారు రూప యెంత బలవంతం చేసినా, ఇంద్రమోహన్ వారితో కూర్చోలేదు. విశ్వం 'నువ్వు వస్తేగాని రానంటాడేమోనని' చూచింది కాని అలాంటిదేం జరుగలేదు.

"ఒక్కసారి పిలిచారు చాలు," అన్నాడు



'మాయింటి దేవర'లో ఒక దృశ్యం * * * * ⟷ * * * * రాధాకృష్ణ'లో ఒక సన్నివేశం

# సినిమా

[ 31వ పేజీ తరువాయి ]

**అక్కినేని జయసుధ నటిస్తున్న ముద్దుల కొడుకు**

జనప్రీతిని చూరగొన్న జగపతి అధినేత శ్రీ రాజేంద్రప్రసాద్, సెప్టెంబరు నుంచి ప్రారంభించనున్న "ముద్దుల కొడుకు" వర్ణ చిత్రంలో డాక్టర్ అక్కినేని, కుమారి జయసుధ ప్రధాన పాత్రలను పోషించగలరని తెలిసింది

కుటుంబగాథా చిత్రంగా, అందరిని ఆకర్షించే అర్హతవున్న కథను గొప్ప చిత్రంగా "ముద్దుల కొడుకు" వుంటుందని, దర్శక నిర్మాత శ్రీ రాజేంద్రప్రసాద్ తెలిపారు

శ్రీ రాజేంద్రప్రసాద్ రూపొందించిన "రామకృష్ణులు" చిత్రం ప్రేక్షకుల అమోఘ ఆదరణను చూరగొన్నది నిజం గాబట్టే ఏ చిత్రానికి రాని వసూళ్లు వస్తున్నాయి ముఖ్యంగా స్త్రీలను, మాస్‌ను విశేషంగా ఆకర్షించిన "రామకృష్ణులు", జగపతి నిర్మించిన హిట్ చిత్రాలను వసూళ్లలో అధిగమించింది

**రామబాణంలో మూడు జంటలు**

"విజ్ఞాన నిర్మాత" శ్రీ ఎమ్. ఎస్. రెడ్డి మాటపాటలు సమకూర్చిన "రామబాణం" స్కోప్ వర్ణ చిత్రంలో మూడు జంటలు నటిస్తున్నారు శోభన్ జయప్రద, కృష్ణంరాజు ల, జగ్గయ్య జమున

ఈ చిత్రానికి వై. ఈశ్వరరెడ్డిని దర్శకుడుగ ఎంపికచేసి ఒక అనుభవ అజ్ఞాత సింహానికి వెలుగునిచ్చిన శ్రీ ఎమ్. ఎస్. రెడ్డి, లభిందించారు "రామబాణం" స్కోప్ వర్ణ చిత్రంలో సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి మోహన్‌బాబు సహాయ పాత్రధారులు

ఈ చిత్రానికి సత్యం సంగీతాన్ని, ప్రకాష్ ఛాయాగ్రహణాన్ని, భాస్కరరాజు శిల్పాన్ని శ్రీనివాసులురెడ్డి కో డైరెక్షన్ను నిర్వహిస్తున్నారు

— శ్రీనివాస్ ★

---

ముఖం ఒట్టించి అతను ఫలహారం చేశాడు బయట వచ్చి కూర్చున్నారు తాతయ్య అందరి వేటుట చూశాడు

"రావయ్యా ఇంద్రయ్యా! నీ చేయి చూపించు"

"నాకు తెలుసు తాతగారూ, నా చేతి వ్రాత, నుదుటి వ్రాత" నవ్వుతూ చెయ్యి అతని ముందుకు చాపాడు

"తప్పదయ్యా! ఈ కాలం కుర్రాళ్లకు చదిలోనే మాట త్రుంచటం అలవాటు అయింది ఇదిగో ఈ ఎమ్‌లా ఉన్న గీత చూడు నువ్వు మిల్లియనీరువవుతావని చెబుతుందయ్యా"

"అచ్చంగా మిల్లియనీరే" శోభన్ నవ్వాడు

"నేను ఆషామాషీగా చెబుతున్నాను అనుకునేవు నిజంగా చెబుతున్నానయ్యా" ఎమ్‌లా కనిపించిన గీతను చూపించాడు ఆయన

"మిల్లియనీరు వంటే, ఏ మంత్రిగారో అయితే తప్ప కాలేవు ఒరేయ్ ఇంద్రా! నువ్వు మంత్రి అయితే ఎంచక్కా, నీ గేటు దగ్గర నన్ను ఉంచుకోరా లేదా సెక్రటరీగా వేసుకున్నానరే చెప్స్ మీద లక్షాధికారి నవుతాను" అన్నాడు విశ్వం

"అబ్బ! ఆశ, యెన్నిసార్లు అవుదామనిరా! రూపాదేవి భర్తగా తాతయ్య మనవడిగా ఇప్పటికే లక్షాధికారివి తాతయ్యా, ధన్యవాదాలు నేను మొలు కందామన్నా యెవరో ఒకరు లేపేవారు

# మోహన రూప

ఈనాడు మీరయినా నన్ను లక్షాధికారిని చేశారు' అన్నాడు ఇంద్రమోహన్ విశ్వం ముఖంలో రంగులు మారటం రూప గమనించక పోలేదు వాళ్లను ఇంటికి పంపించి, అక్కడ, బల్లలు కుర్చీలు సర్దించాడు మిగిలిన లడ్లు ఇంటికి పంపుతూ ఓ రెండు తీసుకుని తిన్నాడు ఒక కార్యం నిర్విఘ్నంగా సాధించానన్న తృప్తి కల్గింది కాసేపు నడుము వాల్చాడు ఆకలిగా ఉంది క్యారియర్ వచ్చేవరకు ఆగాలి విశ్వం యెందుకో మరీ అనుమానం మనిషి అవుతున్నాడు అనుకుని అక్కడే ఉండిపోయాడు

పన్నెండున్నరకు రూపాదేవి వచ్చింది

"ఇంద్రమోహన్ గారూ! ఒక్క విషయము కచ్చితంగా చెప్పండి నేనంటే ఏ అభిప్రాయం ఉంది?" ఉరుములేని పిడుగులా విరుచుకుపడింది

"ఆం అదేం? మీరంటే ఏ అభిప్రాయం ఉందో మీకు తెలియదా! గౌరవము, అభిమానం, ఆత్మీయత"

"అబద్ధాలు అందంగా ఆడగలరు నేనంటే ఏ మాత్రం గౌరవమున్నా ఉదయం అలా చేసేవారా?"

"నేనేం చేశాను?"

"ఆ మాట మెల్లగా అడుగుతున్నారా! మీరు అన్ని ఏర్పాట్లు చేసి మాతో పాటు పార్టీలో పాల్గొన్నారా?..."

"అదా! అంతా చూచేసరికి మొహం మొత్తిందండీ"

"అంతేనా నేను ఏదయినా అగౌరవంగా ప్రవర్తించానా?"

"అబ్బే! ప్రమాణం చెయ్యమన్నా చేస్తాను"

"ప్రమాణాలు వద్దుకాని, ఇప్పుడు స్వయంగా పిలవటానికి వచ్చాను పదండి" అన్నది, బయటికి నడుస్తూ

"ఈ పూటకు నన్ను క్షమించండి నాపై ఏ మాత్రం గౌరవమున్నా నన్ను వదిలి పెట్టండి" అన్నాడు బతిమలాడుతున్నట్టు

"సరే నేనూహించిందే నిజం వచ్చి క్యారియర్ అయినా తీసుకోండి," కారు డోరు తీసి క్యారియర్ ఇచ్చిందామె

"థాంక్స్" అన్నాడు ఆరాధనా భావంతో ఆమె నవ్వి వెళ్లిపోయింది అతను క్యారియర్ విప్పి అందులోని వస్తువులను ఒక్కటీ వదలకుండా ఆప్యాయంగా తిన్నాడు అతనికి తెలుసు తన మనసు ఎటు మొగ్గుతుందో అందమయిన వస్తువులను, అపురూపమయిన వాటిని ఆరాధించటంలో తప్పు లేదు అభిమానించటంలో పొరపాటు లేదు పొందాలనుకున్నప్పుడే వస్తుంది చిక్కు తనకా అర్హత, హక్కు లేవని తెలుసు తన ఆరాధన తనలోనే ఉంచుకున్నాడు

[ ఇంకా వుంది ]

# ట్రూ విధానములో కరాటె నేర్చుకోండి

పాఠము-2

కాళ్ళు రెండు కొద్ది దూరముగా సమాంతరముగా వుంచవలయును కాళ్ల ముందు వైపుకువంచి మోకాళ్లు కొద్దిగ వంచి శరీరము నిదానముగవుంచి,గుప్పెల మూసి ప్రక్కగా వుంచండి



ఈ స్థితినుండి, కాళ్లు కదుపకుండ, కావలసిన దిశకు తలను మరియు శరీరమును కదుప వలయును. మడమలు మీద కదులవలయును.



శరీరమును తొడలను కదిల్చి, మొదటి స్థితికి (గుజ్జము మీద కూర్చున్న స్థితికి) రావలెను. ఇప్పుడు శరీరమును మొదటి దిశ (స్థితికి)కు వ్యతిరేక దిశలో వుంచవలెను.



## హని-గ్లూకోజ్‌నుంచి పొందండి
# అపరిమిత బలము
# అపరిమిత శక్తి



**ఉచితం!**

కరాటెపై ఆకర్షణీయకరమైన పుస్తకము కొరకు ట్రూ గ్లూకోజ్ బిస్కట్లలకు చుట్టబడిన ఐదు (5) కాగితములు పంపించండి. త్వరపడండి! కొన్ని ప్రతులు మాత్రమే వున్నవి.







ప్రతి ముక్కలోను అపరిమిత బలమున్న బిస్కట్లు దానిలోని శ్రేష్ఠమైన తేనె ఈ కరాటె కళను వేగముగ నేర్చుకొనుటకు కావలసిన అధిక శక్తిని యిచ్చును.

**TRUE**
**గ్లూకోజ్ బిస్కత్**

సంపాదించవలసిన చిరునామా
ట్రూ బిస్కట్
ఆరోవుడ్ ప్రయివేట్ లిమిటెడ్
ఆరోవిల్ (వయా)
పాండిచ్చేరి 605 101

## భయం

(18 వ పేజీ తరువాయి)

వెలుతురులో చదువుకోవటానికి ప్రయత్నం చేస్తున్నారు. అందులో అనుపమ ఒకతె.

"హాయ్! భలే! లైట్లు పోయినాయ్!" అని ఒక్క నిమిషం రిలాక్స్ అయ్యారు కొందరు కాని మరు నిమిషంలో—మర్నాటి పరీక్ష గుర్తుకు వచ్చేమో— "అమ్మో!" అనుకుని వరండాలోకి వచ్చారు.

ఆ వచ్చిన వాళ్లలో వాసంతి ఒకతె.

ఎదురుగా ఉన్న బిల్డింగులో ఉన్నాయి లైట్లు. కొంచెం దూరంలో ఉన్న వార్డెన్ క్వార్టర్స్‌లోనూ ఉన్నాయి లైట్లు. ఈ బిల్డింగ్‌లోనే లేవు. అర్ధ గంట గడిచినా పోయిన లైట్లు రాలేదు.

"ఎలాగ? ఎలాగ?" అనుకుంటున్నారు బి. ఏ. అమ్మాయిలు.

"ఫ్యూజుపోయి వుంటుంది!" అన్నది ఒక ఫిజిక్స్ అమ్మాయి

"ఎలక్ట్రిసిటీ డిపార్టుమెంటు వాళ్ళు వచ్చి పోల్ మీద ఫ్యూజు వేస్తేనేగాని లైట్లు వెలగవు" ఒక బి. యస్సీ. అమ్మాయి వివరణ.

"రాత్రి ఎనిమిది దాటితే వాళు రారు" ఒక బి. కాం. అమ్మాయి ఉవాచ.

"అయితే— ఈ రాత్రంతా యింతేనా— రేపు పరీక్షలో..." ఒక బి. ఏ. అమ్మాయి భయం.

"వార్డెన్ గారికి రిపోర్టుచేస్తే, ఆమె ఫ్యూజ్ ఆఫ్ కాల్ ఆఫీసుకు ఫోన్ చేస్తే, వాళ్ళు వస్తారేమో!" ఒక అమ్మాయి ఉచిత సలహా.

ఆ సలహా అందరికీ నచ్చింది కాని— ఎవ్వరూ అది ఆచరణలో పెట్టేందుకు ముందుకు రావటం లేదు. వార్డెన్ గారి క్వార్టర్సుకు వెళ్ళటానికి వారికి భయం.

"అమ్మో! చీకటి!" అని భయపడ్డది ఒక అమ్మాయి.

"పురుగూ, పుట్రా ఉంటాయి" మరొక పిల్ల భయం.

"వార్డెన్ మేడమ్— ఈ సమయంలో డిస్టర్బ్ చేస్తే కోప్పడతారు" తన భయమేమిటో చెప్పింది ఒక ఆడపిల్ల.

"పిరికి ఘటాలు! పిరికివాళ్ళు!"

సంధ్య అక్కడ వున్నదని ఆ చీకట్లో వాళ్ళకు తెలియదు

# భయం

"నేను వెళ్ళి వస్తాను ఉండండి" అని సంధ్య బయల్దేరింది.

"నా దగ్గర టార్చిలైటుంది ఇస్తాను. ఒక్క నిమిషం ఆగు సంధ్యా!" చీకటి అంటే భయపడే అమ్మాయి.

"పోనీ నేను తోడువద్దునుగాని, మొన్న పగటిపూట ఒకపాము-రెండు మూరలుంది. అలా జరజరా నాముందుగా పాకిపోయింది. నన్ను పగపట్టిందేమోనని భయంగా ఉంది. ఏందుకయినా మంచిది-కర్ర తీసుకుపో సంధ్యా!" పురుగూ-పుట్రా ఉంటాయని భయపడే ఆడపిల్ల.

"వార్డెన్ మాడమ్ ఎదుటికిరాను. కావాలంటే గేటుదాకా తోడువస్తాను." వార్డెన్ ఎదుట బడటానికి భయపడే విద్యార్థిని

తోడు తీసుకోలేదు.

కర్ర తీసుకోలేదు

టార్చిలైటు తీసుకోలేదు.

సంధ్య ఒక్కతే వార్డెన్ క్వార్టర్సుకు బయల్దేరింది.

చీకట్లో ఆకాశాన నక్షత్రాలు నల్లటి పట్టుచీరమీద కుట్టిన పువ్వుల్లా ఉన్నాయి. పువ్వుల మాదిరిగానే నక్షత్రాలలోనూ రంగులున్నాయి కాబోలు కొన్ని ఎర్రగా మందారాల్లా, మరికొన్ని తెల్లగా నందివర్ధనాల్లా, ఇంకొన్ని నీలంగా నీలాంబరాల్లా కన్నుల పండుగచేస్తున్నాయి. ఆకాశంలో నక్షత్రాలు కాదు, గ్రహాలూ కన్పిస్తాయిట- కాని పోల్చుకోవటం కష్టం.

ఏంకీ కళ తళతళలు చీకట్లో చూడా లంటాడు నాయుడుబావ. తారల తళుకు చీకటి రాత్రినచూస్తే ఎంత సొగసు! ఎంత సోయగం!!

నక్షత్రాలను చూస్తూ నడిచిన సంధ్య చీకటి అంటే భయపడనూలేదు, పాము ఏమిటో ఎఱుగనూ ఎఱుగదు.

వార్డెన్ క్వార్టర్సుకు వచ్చేసరికి కుక్క "భౌ! భౌ!" అంటూ ముందుకుదూకింది. చిన్న సైజు పులిలా ఉంది ఆ అల్సేషియన్ కుక్క. ఇంకొకరయితే ఆ కుక్క రూపం చూసి, దాని అరుపువిని వెనక్కి పరుగు తీసేవారే. కాని సంధ్య నిర్భయంగా నిలబడ్డది. తనెందుకు భయపడాలి!

"హూ ఈజిట్?" అంటూ వార్డెన్ తలుపు తీసుకుని వరండాలోకి వచ్చారు-

"నేను-సంధ్యను-మాడమ్!"

"ఏమిటి-ఇలా రాత్రి వేళ వచ్చావ్?" గేటు తీశారు వార్డెన్ అల్సేషియన్ వచ్చి వార్డెన్ పక్కన నిల్చుని ఎవరీఅమ్మాయి ఇంత నిబ్బరంగా ఉన్నది-అని ఆశ్చర్య పోతున్నది

తను వచ్చినపని చెప్పింది సంధ్య. ఫ్యూజ్ ఆఫ్ కాల్ ఆఫీసుకు టెలిఫోన్ చేయమని రిక్వెస్ట్ చేసింది.

వార్డెన్ ఫోన్‌చేస్తే-అవతల వాళ్ళు ఏమన్నారో-స్టూడెంట్సుకి పరీక్షలు, చదువుకోవాలి. లైట్లు లేకపోతే ఇబ్బంది-అని చెప్పారు.

వాళ్ళు రావటానికి ఒప్పుకున్నారేమో- థాంక్స్ చెప్పి ఫోన్ పెట్టేశారావిడ

"నువ్వు వెళు సంధ్యా! పది నిమిషాల్లో వచ్చి ఫ్యూజు వేస్తామన్నారు" థాంక్స్ చెప్పి వచ్చేసింది సంధ్య.

అలా వచ్చిన సంధ్యను చుట్టుముట్టారు విద్యార్థినులందరూ యుద్ధ భూమిలోకి ధైర్యంగా వెళ్ళి, సురక్షితంగా తిరిగి వచ్చిన యోధునిలా ఆరాధనగా సంధ్యను చూశారు వారందరూ

వారిసందేహాలకు సమాధానంగా-లైట్లు ఒక పావుగంటలో వస్తాయని- చెప్పింది సంధ్య అన్నట్లుగానే పావుగంటలో లైట్లు వెలిగాయి

మరొకసారి ధూఢి చేసుకున్నారు-

సంధ్యకు- రోడ్ సైడ్ రౌడీలంటే భయంలేదు.

చీకటి అంటే భయంలేదు;

పురుగూ, పుట్రా అంటే భయంలేదు.

వార్డెన్ అంటే భయం లేదు.

* * *

బస్ ఆగింది- అనుపమ వాళ్ళ ఊరు అదే

భయం మెఱుగని సంధ్యను గురించి ఆలోచిస్తున్న వాసంతికి బస్ ఆగినట్లు తెలియదు. సంధ్య భుజం తట్టి వాసంతిని ఈ లోకంలోకి తెచ్చింది

బస్ దిగిన సంధ్యనూ, వాసంతినీ సెంటర్లోని మనుష్యులు ఎగా దిగా చూడసాగారు. అక్కడ చిన్న సైజు హోటలు, రెండు కిళ్ళీ కొట్లు ఉన్నాయి అంత చిన్నదీ కాదు, అంత పెద్దదీ కాదు ఆ ఊరు.

ఆ ఊళ్ళో అనుపమ ఇల్లు వారిద్దరూ ఎఱుగరు.

"వాళ్ళను అడుగుదామా?" అన్నది సంధ్య- సెంటరో ఉన్న మనుషులను చూపించి.

"అమ్మో! అంతమంది మగాళ్ళ మధ్యకు పోయి అడగటమే!" వాసంతి ఆశ్చర్య పడ్డది

"నీకు ధైర్యం లేకపోతే ఇక్కడే ఉండు. నేను కనుక్కు వస్తాను" సంధ్య వాళ్ళ దగ్గరకు వెళ్ళింది.

"చూడండీ..." సంధ్య వారి వంక చూస్తూ సంబోధించింది.



"మీరు చూడనక్కర్లా— చూస్తూనే ఉన్నాం" అందరిలో చిన్నగా ఉన్న కొంటె వాడు అందుకున్నాడు.

"అదే- నిలువుగుడ్లు పడితేనూ— దృష్టి సరిచేసుకోమంటున్నా" సంధ్య బుస్సు మంది వాడిమీదికి.

"వాడుత్త కొంటె కోణంగి. వాడితో నీకెందుకమ్మా! ఏం కావాలి?" వయసు మళ్లిన ఒకాయన సంధ్యను సౌమ్యంగా అడిగాడు.

"రామచంద్రరావుగారింటికి వెళ్ళాలండి వేము. వాళ్ళమ్మాయి అనుపమ అని ఉంది.

కాలేజీలో చదువుకుంటున్నది. వాళ్ళింటికి"

ఆమె చెప్పిన గుర్తు ప్రకారం అనుపమ వాళ్ళ ఇల్లు త్వరలోనే కనుక్కో గలిగారు.

చుట్టూ అయిదారడుగుల ఎత్తున ప్రహరీ గోడ. లోపల డాబా ఉన్నట్లుగా దాని పిట్టగోడలు కన్పిస్తున్నాయి. పాత కాలపు పద్ధతిన పెద్ద తలుపులు ముందు నాలుగు మెట్లు. తలుపులు తీసుకు లోపలికి పోతేకాని ఎవ్వరూ కన్పించరు. గోడమీదుగా జామచెట్టు, కరివేపాకు చెట్టు తొంగి చూస్తున్నాయి.

ఉన్న నాలుగుమెట్లూ ఎక్కి తలుపు దగ్గరకు వారిద్దరూ చేరేసరికి— ముందు పెరడులో ఉందేమో అనుపమ గొంతు— విన్పించింది.

"జాజిపూలు ఇలా ఇచ్చేసి, గులాబీలు కోయవే ఉష్మా!" చెల్లెల్ని హెచ్చరిస్తున్నది అనుపమ.

సంధ్యా, వాసంతీ— ఇద్దరూ ఒకరి మొహాలు ఒకరు తృప్తిగా చూసుకున్నారు. తాము పనిగట్టుకుని వచ్చినందుకు అనుపమ ఇంటి దగ్గర ఉంది. ఉత్తరం అందే ఉంటుంది. సమాధానం ఎందుకు రాయ లేదో?!

అనుపమ కేకవేయబోయిన వాసంతిని వారించింది సంధ్య

"కేక వేయకు, గొంతు గుర్తుపడుతుంది. తలుపు తడదాం. ఎవరా అని తలుపు తీస్తుంది. అప్పుడు ఒక్కసారి అది మన దర్శనం చూసి ఆశ్చర్య పోతుంది. ఆశ్చర్యంతో చారెడేసి కళ్ళు చాటలంతవుతాయి. అప్పుడు కళ్ళు ఎంత బాగుంటాయని అనుకోకుండా వచ్చిన మనల్ని చూసి సంతోషపడుతుంది. ఆ సంతోషంతో అణువణువూ పులకిస్తుంది. అప్పుడు అందాల అనుపమ మరింతఅందంగా ఉంటుంది. ముద్దు ముద్దుగా వుంటుంది" సంధ్య తన పథకం వివరించింది.

"ముద్దు పెట్టుకుంటావా?"

"ఏం పెట్టుకుంటే తప్పా? అనుపమ అంటే నాకు ప్రాణం. అనుపమ అందం అంటే ఎంతో ఇష్టం నాకు."

తలుపు తట్టింది సంధ్య- తబల మీద సన్నగా చేయివేసినట్లు.

"ఎవరూ?" లోపలినుంచి అనుపమ తీయని కంఠం- వీణను చిన్నగా మీటినట్లు. ఎవరూమాట్లాడలేదు మరోకసారి తట్టింది.

"ఎవరూ- అది— మాట్లాడరేం?" కొంచెం హెచ్చుస్థాయిలో అనుపమ. పేరు చెప్పబోయిన వాసంతి నోటికి చేయి అడ్డు పెట్టింది. సంధ్య. చిలిపిగా లోలోన నవ్వు కుంటూ మరోసారి తలుపుతట్టింది సంధ్య.

"కొత్తగా వచ్చారే పోస్టుమాష్టరు. వారమ్మాయేమో అక్కా! పాపం ఆ పిల్ల మూగపిల్ల కదా- మాట్లాడలేదు. తలుపు తట్టిందిగాని" అనుపమ చెల్లెలు అక్క ముందు తన ఊహ పరుస్తున్నది

"అదే—అయిఉండాలి. నేతిస్తాలే—నువ్వా పూలు కోయటం కానీయి."

అనుపమ కాలి పట్టాల సన్నని శబ్దం— సంధ్య హృదయ శబ్దానికి లయబద్ధం.

అనుపమ తలుపు తీస్తున్న చప్పుడు— సంధ్య హృదయ కవాటాలు సుకుమారంగా తెరుచుకుంటున్న సవ్వడి.

తలుపు తీసింది అనుపమ.

"మీరా?" అనబోయింది. కాని నోట మాటరాలేదు.



స్వర్ణోత్సవాలు చేసుకుంటూ యీ సందర్భంగా పలువురు ప్రముఖులకు గౌరవ డాక్టరేట్లు ఇచ్చిన ఆంధ్ర విశ్వవిద్యాలయ పరిషత్ బహుళ ప్రాచుర్యంగల ఆధునిక నవలా రచయిత్రి శ్రీమతి 'లత'కు గౌరవ (కళాప్రపూర్ణ) పట్టా ఇచ్చి గౌరవించదలిచారు. 30 సం॥లుగా కాలమిస్టుగా, "నోవలిస్టు"గా నిర్విరామంగా రచనలు చేస్తున్న శ్రీమతి తెన్నేటి హేమలత ఆటీవల రామాయణ విషవృక్ష ఖండన గ్రంథం వ్రాసి విమర్శకులలో కూడా మంచి చోటు చేసుకున్న రచయిత్రి. ఈమె విజయవాడ వాస్తవ్యురాలు. రాష్ట్ర సాహిత్య అకాడమీ సభ్యురాలు.

---

ఆ దృశ్యం చూసి సంధ్య కెవ్వున కేక వేసింది–భయపడి

రోడ్‌సైడు రౌడీలు, కారు చీకటి, పురుగూ–పుట్రా, అల్సేషియన్ కుక్కా, వార్డెన్ మాడమ్, సెంటర్లోని పదిమంది కొత్త మగవాళ్ళు– వీటికి వేటికీ భయపడని సంధ్య అనుపమని చూసి భయపడ్డది.

అందుకు కారణం–

కాలేజి బ్యూటీ అనుపమ అందాల మొహం, సెలవుల్లో జరిగిన ఫైర్ యాక్సిడెంటులో, వికృతంగా తయారవటమే! కమిలిపోయిన టమాటోల్లాగా ఉన్నాయి బుగ్గలు...మాడిపోయిన బీడిగింజల్లా ఉన్నాయి కళ్ళు ..వళ్ళగా వేగినకాకరకాయలా ఉంది ముక్కు–చూడలేక కళ్ళకు చేతులడ్డం పెట్టుకుంది సంధ్య.

–అపురూపంగా చూసుకుంటున్న తన అందమూ, ఏదైనా కీడు జరిగితే, ఇలాగేగా అన్న ఊహ సంధ్య మనసును భయపెడుతున్నది!

పక్కకి ఒరిగిపోతున్న సంధ్యను వాసంతి పొదివిపట్టుకుంది.

# వారఫలం

**21–7–1978 శుక్రవారం మొదలు**
**27–7–1978 గురువారం వరకు**

**మేషం.**— నూతన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. వారం మధ్యలో మీ ఆలూకు వస్తువులు పోవచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది వారం ఆఖరులో అనుకూల పరిస్థితి యేర్పడగలదు. స్త్రీలకు–ఆరోగ్యం బాగుండదు సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృషభం :**— అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు. వృత్తిలో ఆదాయం బాగుంటుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వారం ఆఖరులో ప్రయాణ కలుగుతుంది. స్త్రీలకు–బంధు మిత్రులను కల్సుకొంటారు. వ్యతిరేకమైన వార్తలను వింటారు.

**మిథునం.**— రావలసిన డబ్బు అందుతుంది. ప్రయాణాలు ఫలిస్తాయి స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. మీరు యిది వరకు చేసిన ప్రయత్నాలు ఫలిస్తాయి స్త్రీలకు–ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :**- సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. ఉద్యోగంలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలమైన వార్తలను వింటారు విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. పోటీవారిలో గౌరవం బాగుంటుంది. స్త్రీలకు–కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది దైవ కార్యాలు నెరవేరతాయి.

**సింహం :**— మీ ఆలోచనలు ఫలిస్తాయి. ప్రయాణాలు బాగుంటాయి. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది మీ ఆలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. స్త్రీలకు–ఆరోగ్యం బాగుండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కన్య**— రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది మీ కార్యక్రమాలకు ఆటంకాలు వస్తాయి రావలసిన డబ్బు అందుతుంది వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు వారం ఆఖరులో ప్రయాణ కలుగుతుంది స్త్రీలకు– కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్య కార్యాలు చేస్తారు.

**తుల :**— సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది వృత్తిలో పోటీ వారిపోటీ పెరుగుతుంది అనవసరమైన ఖర్చులు కలుగుతాయి భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు–ఆరోగ్యం బాగుంటుంది వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృశ్చికం :**— మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది పోటీ వారితో వాద ప్రతివాదాలు తగవు స్త్రీలకు– దైవ కార్యాలు నెరవేరతాయి. అధికంగా ధన వ్యయం జరుగుతుంది.

**ధనస్సు**— అనుకూలమైన వార్తలు వింటారు. వ్యాపారంలో పోటీవారి పోటీ తగ్గుతుంది ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. మీ మంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది, వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి స్త్రీలకు–ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**మకరం :**— మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. సాహసిక వ్యవహారాలు లాభిస్తాయి వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది స్త్రీలకు–కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**కుంభం :**— ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది రావలసిన డబ్బు అందుతుంది వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి స్త్రీలకు–ఆరోగ్యం బాగుంటుంది. సంతోషకరమైన సమాచారం అందగలదు.

**మీనం** - మీ ప్రయత్నాలకు ఆటంకాలువస్తాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. ప్రయోజనంగల పరిచయాలు యేర్పడతాయి స్త్రీలకు–కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి దైవ కార్యాలు నెరవేరతాయి.

— మహేష్

# ఫాలాక్షుని డైరి

## చారు నీళ్ళు చావు దెబ్బలు ?!

విజయవాడలో ఓ వివాహంలో విందు భోజనం జరుగుతుండగా భోంచేస్తున్న ఒక కుర్రాడు చారు ఏం మాత్రం బాగులేదని, ఉద్ధ కిక్కగా వుందనీ ఓ జనాంతిక విసిరాడట. ఈ మాట విన్న పెళ్ళి వారిలో ఒ హోయన 'అంతమాటంటావా' అని ఓ కర్రతో బాదాడట అయినా ఈ సంఘటనవ అ కుర్రాడితో పాటు అతని తండ్రి కూడా ఆశ్చర్యపోయి, అడ్డువెళ్ళాడట ఆగ్రహం అతని కింకో వ్యక్తి కూడా సాయంచేసే సరికి ఆ పెద్దాయన దెబ్బలు తట్టుకో లేక విలవిల్లాడి, చనిపోయాడట. కుర్రాడికి కూడా చావు దెబ్బలు తగిలాయట

## సర్దార్‌కు శిల ?

స్వాతంత్ర్యం సంపాదించిన కొత్తలో సర్దార్ వల్లభాయ్ పటేలు అనుయాయులు కొందరు ఆయన శిలా విగ్రహాన్ని ప్రతిష్ఠించడానికి సన్నాహాలు చేస్తున్నామని ఆయన సమ్మతికి వెళితే ఆయన చిన్నగా నవ్వేసి, "కొన్ని సంవత్సరాలు పోయాక, ఆ శిలను చూసి, ఎవడు వీడు వీడి కెందుకు శిల అని అడిగేబదులు నిజంగా జనానికి నేను గుర్తుండే సర్దార్‌కు ఒక్క శిలైనా పెట్టలేదేమి అనడిగితే అదే గొప్ప ఆనందం. ఆ ఆలోచనే నాకు తృప్తి, అందుకని నన్నిలా వది లెయ్యండి అన్నారట

## జాతి ప్రేమ !

ఇందిరాగాంధి పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ ' మాట్లాడుతూ ఇంకో విలేఖరి కూడా వచ్చినట్టు కనిపిస్తుంది' అన్నారట. ఆ మాట కంటా పట్టుకుంటే గోడమీదో కోతి కూర్చునివున్నదట దాని కంతరూ ఘొల్లుననవ్వితే, ఆ జోకులోంచి కొందరు తేరుకోకపోయినా బయట ఎద్ద విలేఖరొకాయన 'అప్పుడు జాతిప్రేమ కదా' వినడాని కొచ్చింది అన్నారట

## విదేశీయుని ఆగడం !

ఢిల్లీలో రిఫ్రిజిరేటర్లు బాగుచేసే ఓ కంపెనీలో తన ఫ్రిజ్ యిచ్చిన వో విదేశీయుడు తన ఫ్రిజ్ యిచ్చెయ్యమన్నాడట అయ్యా మీ ఫ్రిజ్ రిపేరు చేయలేదింకా అని షాపువాడంటే, అయితే ఆ ఫ్రిజ్ ఎట్లున్నా సరే తీసుకుపోతానన్నాడట యింకో ఫ్రిజ్ చూపిస్తూ, దానికా షాపువాడు అది ఎంబెసీలో పని చేస్తున్న మరొకాయనది మొన్ననే అనగానే ఆ విదేశీయుడు పిస్తల్ తీసి ఢాం ఢామ్మని ఆరు సార్లు పేల్చాడట షాపువాడి విపరీతానికి కొయ్యబారిపోయాడట కారణం! ఆ విదేశీయుడు కాల్చింది షాపువాణ్ణి కాదు. ఎంబెసీలో పని చేస్తున్న మరొకతని ఫ్రిజ్‌నట

## రోమ్‌నించి వచ్చిన నన్‌ని చెరచిన విమానాశ్రయ ఉద్యోగి

రోమునుంచి ఒక మత ప్రచారకురాలు (నన్ అంటే అంతేనా) బొంబాయి శాంతా క్రజ్ విమానాశ్రయంలో దిగిందట మద్రాసు వెళ్ళవలసివున్నా టిక్కెట్లు దొరకపోవడం వల్ల ఆమె వెళ్ళలేక పోయిందట విమానాశ్రయంలోని ట్రాఫిక్ అసిస్టెంటొకాయన ఆమెకు ఒక హోటలులో బస చేయించి తాను సహాయం చేస్తానని నమ్మించి, ఆనక ఆమెను బలాత్కరించి చెరిచాడట. సోదరుడు!

## 105 ఏళ్ళ పార్లమెంటు సభ్యుడు !

ప్రపంచ దేశాలలో అధిక వయస్సు కల పార్లమెంటు మెంబరు చైనాలోవున్నారట చైనా పార్లమెంటు ఎం పి వయస్సు నూటయిదు సంవత్సరాలట ఆమెయిప్పటికి చక్కగా ఆరోగ్యంగా వున్నాడటా వయస్సులో.

18 సంవత్సరాలుగా తెలుగువారికి సేవచేస్తున్న ఆంధ్రుల
అగ్రశ్రేణి దినపత్రిక **ఆంధ్రజ్యోతి** సమర్పిస్తున్న

# వనితాజ్యోతి

సచిత్ర మాస పత్రిక

నారీ లోకానికి నవోదయం!




— స్త్రీలు విపరీతంగా పాల్గొంటున్న చర్చావేదిక మాజీ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీని శిక్షించాలా వద్దా?

— శ్రీ బాపు పంచరంగుల ముఖచిత్రం

— లోపలి పేజీల్లో వాణిశ్రీ వస్త్రానందం, డ్రెస్సింగ్ టేబుల్‌పై అలంకరణకు అల్లికపూలు, రంగురంగుల రబ్బరు బెలూన్లు, రకరకాల రమ్యమైన ఫలాలు, వాణిశ్రీ చదువుతున్న వనితాజ్యోతి - కలర్ ఫొటో ఫీచర్స్

— రకరకాల శీర్షికలతో వైవిధ్యంగల రచనలతో జూలైనుంచి వస్తుంది!

ఆఫ్‌సెట్ ముద్రణ - 64 పేజీలు - రెండు రూపాయలే!

వివరాలకు — బిజినెస్ మేనేజర్
ఆంధ్రజ్యోతి. P.B.No-712
విజయవాడ - 11



నేటి వనితకు మేటి పత్రిక!

# అంతా గ్యాస్ పొయ్యి

పి. పద్మావతి.



ఉదయం 8 గంటలయింది. ఆఫీసుకెళ్లే వాళ్ళు హడావుడి స్కూళ్ళు, కాలేజి కెళ్ళేవాళ్ళు. ఆ కంగారులో దువ్వెన కోసం వెదుకులాడేవాళ్ళు ఒకరయితే, అద్దం కోసం అరచేవాళ్ళు ఇలా వాళ్ళ అరుపులతో మహా కంగారు పడుతూ వుండే యింటిల్లిపాదినీ సముదాయించలేక నానా అవస్థ పడే సీతమ్మగారి వంట తొందరగానే అవుతుంది.

ఎందుకంటే సీతమ్మగారింటిలోనూ వుంది ఒక "గ్యాస్ పొయ్యి" కొడుకు ఆఫీసుకు వెళ్లే వేళయిందని కంగారు పడుతూ "అయ్యో రామా! నా బంగారు తండ్రికి వేళ్ళవుతుందేమో, నాలుగు మెతుకులు తినకుండా వెళ్లిపోతాడేమో" అని ఒకటే హడావుడిపడి పోతోంది, సీతమ్మగారు.

"బామ్మా! మరిమడీ తడీఅంటూ యింత ఆలస్యం చేస్తావు తెల్లారి లేచింది మొదలు స్నానాలు, జపాలు చేసి ప్రాణం తీస్తావు అయినా బామ్మా! నాకు తెలియక అడుగుతా? గ్యాస్ పొయ్యికి కూడా ఏ పార్టు కా పార్టు ఊడదీసి కడుగుతావు, ఎందుకు? దానితోనే ఆలస్యం అవుతుంది. ఏం? నీ కొడుకే! గాని నాకు మాత్రం కాలేజీలేదూ? త్వరగా అన్నం పెట్టు బామ్మా వెళ్ళిపోవాలి" అంటూ పీటవేసుకు కూర్చున్నాడు, మనవడు నారాయణ ఉరిమి చూసింది మనమడివైపు ఆమె "ఏంరా? నా పూజలనే వెటకరిస్తావు మరి మీలాగ శుచి, శుభ్రం లేకుండా మడీ తడీ వుండలేను. మనిషి పుట్టాక దేవుడు, దేవత అని లేకుండా వుండలేను ఈ రోజు ద్వాదశి. పరమ పవిత్రమైన రోజు నువ్వు అలా మాట్లాడకూడదు నీ షోకులు, తిరుగుళ్లు మాని బాగా చదవరా నాయనా! అంటే విన్పిస్తుందా నీకు? నా మడిమాట అటుంచు కడగకపోతే తుప్పు పట్టి పాడవదూ? గ్యాస్ పొయ్యి? అయినా ఆడంగి కబుర్లు నీకెందుకురా?" అంటూ, ఇంతెత్తున ఎగిరి పడింది బామ్మ సీతమ్మ "సరేలే! ముందు నాకు అన్నం పెట్టు" అన్నాడు వాడు

"ఆఁ నువ్వేనా కాలేజీకివెళ్లే మొనగాడివి చెల్లాయి మాత్రం వెళ్ళద్దూ స్కూలుకి?" అని "ఏమేవ్ అమ్మడూ! అన్నం పెడతాను రావే! అమ్మడూ!" అంటూ పిల్చింది తల్లితో జడ వేయించుకుంటున్న మనమరాలు సుధని "అమ్మా! నాకూ అన్నం పెట్టు" అంటూ కొడుకు విశ్వం వచ్చి కూర్చున్నాడు.

"అయిపోయింది బాబూ! కూర దగ్గర పడుతోంది. వడ్డిస్తున్నా" నంది బామ్మ ఇంతలో కోడలు అనసూయ గబగబా వచ్చి అత్తగారి సహాయంతో అందరికి భోజనాలు వడ్డించబోయింది! కాని తండ్రి పిల్లలు భోజనాలు కోసం వచ్చి కూర్చోగానే, "అమ్మాయ్! అనసూయా చూడమ్మా పొయ్యి ఆరిపోయింది. కొంపదీసి గ్యాస్ అయిపోలేదు కదా?" అంది భయంభయంగా సీతమ్మగారు కోడలు కంగారు పడుతూ "లేదండీ! మొన్ననేగా తెప్పించాం. ఒరేయ్! నారిగా! గ్యాస్ పొయ్యి ఆరిపోయింది చూడు," అంటూ పిల్చింది కొడుకుని

"చూడు! చూసి కాలేజికి వెళ్ళిపోయి సాయంకాలం తిన్నగా వచ్చేయి ఇంటికి" అని కొడుకుని హెచ్చరించి, తల్లితో, భార్యతో చెప్పి ఆఫీసుకు వెళ్ళిపోయాడు విశ్వం కూర లేకుండానే తినేసి!

"ఏం రా! గ్యాస్ అయిపోలేదు కదా?" అని అడిగారు ఇద్దరూ కంగారుగా, రెగ్యులేటర్ బిగిస్తున్న నారాయణతో, నారాయణ ముఖం చిట్లించుకొని "అబ్బ లేదురా! ఇది ఇందాక సరిగా పెట్టలేదేమో అందుకు ఆరిపోయింది" అన్నాడు. కాని అంతలోనే

వాడి మాటలు టక్కున ఆగిపోయాయి. చేతిలోంచి "రెగ్యులేటరు" జారి భళ్ళున బద్దలైంది.

"అయ్యో, అయ్యో నీ చేతులు విరిగిపోను ఇపుడెలాగరా! అలా చేసేశావు?" బామ్మగారికి మతి పోయింది. ముందు నిర్ఘాంతపోయింది. తరువాత తిట్లు మొదలు పెట్టింది. ఎందుకంటే ఆవిడ ద్వాదశి పారాయణం హుళక్కి ఐపోతోంది. అనసూయమ్మ నిరుత్తరాలైపోయింది!

"అమ్మా!, బామ్మా! నాన్నగారికి చెప్పకండే నెలాగైనా వెళ్ళి కొత్త రెగ్యులేటరు పట్టుకొస్తాను" అంటూ ప్రాధేయపడ్డాడు నారాయణ "ఎలా పట్టుకొస్తావురా! అసలు, మరి డబ్బు ఎవరిస్తారు? చేసిన నిర్వాకం చాలుగాని వెళ్ళి నాన్నతో చెప్పరా! డబ్బు ఎంత అవుతుందో ఏమో. అసలే వాడు ఖర్చుల్లో ఉన్నాడు" అని బాధ పడ్డది సీతమ్మ "ఎంత అయితే ఏమిటి లెండి? అసలు వస్తువు దొరకాలి కదా! అంది బాధగా అనసూయ.

"అత్తయ్యా! మీరు కుంపటి మీద చేసుకోండి. నేను యిలానే యీ భోజనం చేసేస్తాను ఆనక" అంది అనసూయ.

బామ్మగారు కుంపటి అవగానే సగం నీరు కారిపోయింది!

"అత్తయ్యా! ఈ పూట కూర ఏం చేద్దాం, అంది అనసూయ బియ్యంలో బెడ్డ ఏరుతూ."

"వంట ఎలా చేసుకోవడం. చావు వచ్చింది. ఆ కిరసనాయిలు పొయ్యేనా అది అంటే నాకు మహా చెడ్డ మంట. వెధవ వాసన అదీనూ. ఒక పట్టాన వుడకవు కుంపటిమీద పెడితే. ఇక అదే గతి, ఏం చేస్తాం కర్మ" అంటూ నీరసంగా లేచింది సీతమ్మ. "ఇవాళ కూర ఏంచేయొద్దు. పప్పుల్లు ఉన్నాయి, కందిపొడవుంది దానితో గడిపేద్దాం పరవాలేదు అన్నాడు దీక్ష్యం.

"అత్తగారి వంట రహస్యం అంతా గ్యాస్ మహిమ" అన్నది కోడలు భర్తతో రహస్యంగా...

సాయంకాలం నీరసంగా వచ్చాడు నారాయణ. గబగబా ఎదురెళ్ళింది సీతమ్మగారు. "దొరికిందా?" అంది ఆత్రుతగా. "లేదు" అని తల అడ్డంగా త్రిప్పాడు వాడు. "ఇక్కడ దొరకదట అప్పన్న ఇస్తానన్నా పుచ్చుకోలేదు. ఆయినా ప్రయత్నంమీద చూస్తామన్నారు. దొరకనట్టే ఇక! మరి పాలకొల్లు వెళ్ళాలట. ముందుగా తెలియజేస్తే వాళ్ళు ఆర్డరిచ్చి తెప్పిస్తారట! ఇపుడే వెళ్ళాలి" అంటూ తయారయ్యాడు వాడు.

"అంత తొందరేమొచ్చిందిరా, రేపొద్దుట వెడుదువుగాని" అంది అనసూయ. "అన్నం తిందువుగాని, ఎప్పుడనగా తిన్నావో" అంది పళ్ళెం తీస్తూ.

"అమ్మా కూరేంచేయలేదా?" అంటూ వాడే వెంటనే "అవునులే గాస్ పొయ్యి లేదుగా" అన్నాడు నిట్టూరుస్తూ నారాయణ. తప్పు వాడిదేగా మరి.

పాలకొల్లు వెళ్ళి మూడురోజులకి తిరిగి వచ్చిన నారాయణని చూస్తూ సంతోషంగా ఆత్రుతగా అడిగారు అంతా. "ఏమ్మా! దొరికిందా?" అంటూ. "లేదు, ఆర్డరిచ్చారు వస్తే తెలియజేస్తారట! అడ్వాన్సిచ్చాను. ఎన్నాళ్ళు పడుతుందో" అన్న నారాయణ మాటలకి దిగాలుపడి పోయారు అత్తా కోడళ్ళు!

అంతలో ఏదో గుర్తు వచ్చిన సీతమ్మ "ఓరేయ్! ఇన్నాళ్ళు వుండిపోయావే అక్కడ" అంది సాగదీస్తూ. మళ్ళీ అడిగింది "ఎంతడబ్బు పట్టుకెళ్ళావు అక్కడికి" అంది అనుమానంగా చూస్తూ. మండిపోతూ చూశాడు బామ్మ వైపు నారాయణ. "డబ్బు నా స్వంతానికి ఏం వాడుకోలేదులే. ఫ్రెండ్ కే ఇచ్చాను అడ్వాన్సుగా." "ఎంత ఇచ్చావేమిటి?" అంది మళ్ళీ. "నీకెందుకు అన్నీ? నాన్నగారితో చెప్తాను నీకు కాదు" అన్నాడు కోపంగా వాడు.

"ఏమండీ! బామ్మగారు పురాణానికి రావడంలేదు" అంది పక్కింటి జానకి ఏదో పనిమీద వచ్చిన సీతమ్మగారిని పలకరిస్తూ. "ఏం చెప్పమంటావమ్మా తల్లీ! మా పొట్టు గాస్‌పొయ్యి విరగ్గొట్టాడు కదా మావాడు చచ్చిపోతున్నామనుకో, అసలు వంట అవుతుందీనా? అసలు ఎప్పుడు వస్తుందో ఏమిటో, ఇడ్లీ వేసుకుందామంటే భయం. అట్లు పోసుకుందామంటే భయం. వేళకి వంటకాక అవస్థగా వుందనుకో! జానకమ్మ తల్లీ! పిల్లలు ఏమీ లేదని గోల" ఏకబిగిన అడిగిందే ఆలస్యం అన్నట్టు బెంగగా చెప్పకుపోతున్న సీతమ్మగారిని చూస్తే జాలేసింది జానకికి.

నిజమే మరి! గాస్ లేకపోతే బాధే ఆ బాధ అందరికీ తెలుసు. ఒకసారి పది రోజుల వరకు గాస్ దొరకకపోతే తను బెంగ పెట్టుకుని వంటింటి ముఖం చూడడానికి భయంవేసి మంచమెక్కింది. "బామ్మగారూ ఏం పోయిందండీ?" అనడిగింది జాలిగా.



# అంతా గ్యాస్ మహిమ

"అదేనమ్మా ఎర్రగా వుండదూ" అది అంది సీతమ్మ. అర్థం కాలేదు జానకికి మొదట. తరవాత తెలిసింది. "ఓ అదా! రెగ్యులేటరా? చాలా కష్టం అండీ అది పోతే దొరకడం."

"అయ్యో అందరూ అదే మాటంటున్నారమ్మా ఏమిటో తల్లి. అమ్మా! వచ్చిన సంగతి మరిచిపోయాను. ఈ సీసా కిరసనాయిలు వుంటే ఇవ్వమ్మా! అనక అబ్బాయి వచ్చాక తెప్పించి ఇచ్చేస్తాను" అంది సీతమ్మగారు "అలాగే బామ్మగారు పట్టుకెళ్లండి దానికేం" అంటూ తెచ్చిచ్చింది ఇల్లాలు.

ఇంటికి వచ్చిన సీతమ్మగారు అడిగింది కోడలిని "వాడు నారాయణ వచ్చాడటే" అని. "లేదండి అసలు వస్తుందో లేదో. ఎలాగో ఏమో లే కర్మ, నే చెప్పలా వాడొట్టి వెధవ ఇక వాడిని జన్మలో ముట్టుకోనివ్వకూడదు, ఆ పొయ్యిని" అంది ఈసడిస్తూ.

సీతమ్మగారికి గాస్ పోయిననాటి నుంచి మనవడిని చూస్తుంటే చిర్రెత్తుకొస్తుంది. ఈ పదిరోజులనుంచి వాడితో మాట్లాడ్డమే మానేసింది, మళ్లీ నాలుగు రోజులైంది. అది పట్టుకురావడానికి వెళ్లాడు పాలకొల్లు.

"ఇంతలో రేగిన క్రాపుతో నలిగిన బట్టలతో వుసూరుమంటూ వచ్చాడు, నారాయణ. సంభాషణ ఆపి వాడి వైపు చూసారు ఇదరూ. ఏం? ఏమైంది వెళ్ళిన పని అని అడిగింది తల్లి. మాట్లాడకుండా, నిర్బంగా కూర్చున్నాడు. సరిగా వెళ్ళి కనుక్కున్నావా? లేకపోతే సినిమాలు, షికార్లు తిరిగావా? అసలు నీకు పోగొట్టానని బాధ వుందా? సరేలే నాన్నని రానియ్ చెబుతాను నీపని. నిన్ను పంపించే బదులు ఎవరినైనా పంపిస్తే పని అయి వుండేది, ఈ సరికి." అనసూయకి రెగ్యులేటరు దొరకలేదన్న బాధ, అత్తగారి తిట్లు ఇవన్నీ ఆవిడ సహనాన్ని పోగొట్టేయి.

ఇంతలో విశ్వం లోపలికి వస్తూ ఏంరా? రెగ్యులేటరు దానికి బిగించలేక పోయావా? అన్నాడు చొక్కా గుండీలు విప్పుతూ. ఏమిటి చెప్పాడా అది ఆనందంగా, ఆశ్చర్యంగా అడిగారు. మొహాలు ట్యూబ్‌లైట్లులా వెలిగాయి, అత్తా, కోడళ్లకి. చెప్పవేందిరా? నాకొండా అంటూ సంబరపడింది బామ్మగారు. చెప్పనిస్తేనా వాడిని తిట్టు మొదలు పెట్టారు. పెట్టేయిరా అన్నాడు విశ్వం కొడుకు వైపు చూస్తూ. "నేను పెట్టనండి అది బామ్మ మడిపొయ్యి కదా" అన్నాడు కొడుకు తల వంచుకొని.

"అది ఏమిరా కొండా నా బంగారు తండ్రివి కదూ! లే అన్నీ నా పోలికలే మాట పడవు" అంటూ బతిమాలింది సీతమ్మ.

రాత్రి భోజనాల సమయంలో రెండు కూరలు, చారు చూసి అరే అప్పుడే ఇన్ని చేసారే? అన్నాడు ఆశ్చర్యంగా నారాయణ. మరిచిపోయానురా మీ బామ్మ అంటే అంది అనసూయమ్మ.

వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టుయింది ఆడవాళ్లిద్దరికీ. అమ్మా ఈవేళ శివాలయంలో పురాణం వుందట వెడతావా? శాస్త్రి ఇందాక కనిపించినపుడు చెప్పాడు, అన్నాడు విశ్వం పాయసం నోటి దగ్గర పెట్టుకుంటూ.

"అదికాదు నాన్నగారు [illegible] కాదు గ్యాస్ మహిమ దేవుడిని కూడా అంత పూజించదు, బామ్మ. గ్యాస్‌పొయ్యి వచ్చిందిగా అదే తనకి ప్రియాతి ప్రియమైనది. అందుకే దానికి 'మడి' పెట్టేసింది" అన్నాడు పిల్లాడు!

## ఈ నేలలో జీవితం

— రామా చంద్రమౌళి

ఈ నేలలోనే
నా జీవితాన్ని పోగొట్టుకున్నాను
ముప్ఫయి వసంతాలు నాపై రాల్చిన
అశ్రువులు
చెట్టునైన నా ఆకులపై ఆసిడ్ చుక్కలై
కాలేశాయి గుండెలను
ఇప్పుడు ఎండిపోయిన కొమ్మల చేతులతో
గగనాన్ని పిలుస్తున్న నా ఆక్రందన
ఒట్టి జలహీన మేఘంలో చచ్చిపోతోంది—
మోళ్లపైబడి ఆకాశాలు ఎంత ఏడ్చినా
లాభం లేదు
మొక్కలకే అందించాలి చినుకుల
చిరు ముద్దును—
మట్టిలో మణులను నాటితే బొగ్గులు
పుడతాయి
వసంతాలు కావాలనుకుంటే
ఈ మట్టిలో నాటాల్సింది మామూలు
విత్తులనే—

# హైదరాబాద్ నోట్ బుక్

**శ్రీ చిన్నపరెడ్డికి సుప్రీంకోర్టు జడ్జి పదవి:**

రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ బి. చిన్నప రెడ్డి సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా నియమితులు కావడం ఆనందాయకం. శ్రీ రెడ్డి వయస్సు 56 సంవత్సరాలు. ఆయన అనంతపురంజిల్లాలో జన్మించారు. గుత్తిలోని లండన్ మిషన్ హైస్కూలులోను, మద్రాసు లయోలా కాలేజి, లా కాలేజిలోను విద్యాభ్యాసం చేశారు. 20 ఏళ్ళ వయస్సులోనే న్యాయశాస్త్ర పట్టభద్రులయ్యారు. 1944 లో మద్రాసు హైకోర్టు అడ్వకేటుగా చేరారు 1954 నుండి 56 వరకు గుంటూరులో న్యాయవాదిగా వున్నారు. ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత హైదరాబాద్ వచ్చారు. 1960 లో ఆయన పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమితు లయ్యారు 1967 లో రాష్ట్ర హైకోర్టు న్యాయ మూర్తిగా నియమితులయ్యారు 1976లో ఆయనను పంజాబ్-హర్యానా హైకోర్టుకు బదిలీ చేశారు. కొన్నాళ్లు ఆ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా ఉన్నారు. 1977 లో మరల ఆంధ్రప్రదేశ్ హైకోర్టుకు తిరిగి బదిలీ అయ్యారు. శ్రీ చిన్నప రెడ్డి తండ్రీ మాతామహుడూ న్యాయవాదులే గనుక, సుప్రీంకోర్టులో సత్సంప్రదాయాలు స్థాపిస్తారనుకోవచ్చు.

**ఉస్మానియా తెలుగు వేసవి శిక్షణ :**

విశ్వ విద్యాలయాల గ్రాంట్సు కమిషన్, ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగుశాఖ ఏర్పాటు చేసిన తెలుగు వేసవి శిక్షణ శిబిరం జూన్ 12న విశ్వవిద్యాలయం ఆవరణలో ప్రారంభమయి మూడు వారాలపాటు జరిగింది. దాదాపు 40 మంది లెక్చరర్లు పాల్గొన్నారు. విద్యా మంత్రి శ్రీ భవనం వెంకటరామ్ ప్రారంభో త్సవం జరుపుతూ, అనువాదాలలో ఆంగ్ల పారి భాషిక పదాలను యథాతథంగా వాడడం ఉచితమని సూచించారు. తెలుగు మీడియంను సమర్థంగా చేయడానికి విద్యార్థులను ఆకర్షించడానికి ఏమి చేయాలో శిబిరం ఆలోచించాలని ఆయనకోరారు.

ఉన్నత విద్యాశాఖ డైరెక్టర్ శ్రీ వి. రామచంద్రన్ అధ్యక్షత వహించారు. ప్రారంభంలో ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షుడు ఆచార్య డాక్టర్ రామరాజు స్వాగతం చెబుతూ తెలుగుకు తగిన పరిగణలేదన్నారు. తెలుగు అభివృద్ధిని గురించి మాట్లాడే వారంతా తమ పిల్లలను ఇంగ్లీషు మీడియం స్కూళ్ళకు పంపుతారని ఆయన అన్నారు. చివరన తెలుగు శాఖ రీడరు శ్రీమతి డాక్టర్ నాయని కృష్ణకుమారి కృతజ్ఞత తెలిపారు.

## జనతా, సి. పి. ఎం పార్టీల ప్రదర్శనం :

జనతాపార్టీకి, సి. పి. ఎం. కు చెందిన రైతు కార్మిక సంఘాల ప్రతినిధులు జూన్ 26న చార్‌మినార్ నుంచి విధాన సభాభవనం వరకు బ్రహ్మాండమైన ఊరేగింపు జరిపారు. ఊరేగింపు ప్రవేశద్వారం వద్దకు రాగానే విధానసభలో వున్న ముఖ్యమంత్రి డాక్టర్ చెన్నారెడ్డి వెలుపలికివచ్చి కలుసుకొని ప్రదర్శకులు సమర్పించిన 27 అంశాలతో పూర్తిగా ఏకీభవించి, పూరించడానికి ప్రయత్నిస్తానన్నారు. రైతులకు గిటుబాటు ధరలు, వ్యవసాయ కార్మికులకు కనీసపు వేతనాలు మున్నగునవి ఆ అంశాలు. ఊరేగింపుకు జనతాపార్టీ అధ్యక్షుడు శ్రీ ఎం.వి. ఎస్. సుబ్బరాజు సి.పి.ఎం. నాయకుడు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య నాయకత్వంవహించారు.

## రాజధానిలో రాష్ట్రపతి :

యధా సంప్రదాయం రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి దక్షిణాదిలో మకాం ప్రారంభమయింది: ఆరు వారాలపాటు హైదరాబాద్‌లో మకాంచేయడానికి ఆయన జూన్ 24 న ప్రత్యేక విమానం "రాజ్ దూత్"లో ఢిల్లీ నుంచి వచ్చారు. గవర్నర్ శ్రీమతి శారదాముఖర్జీ, ముఖ్యమంత్రి డాక్టర్ ఎం చెన్నారెడ్డి మున్నగువారు విమానాశ్రయంలో ఘనస్వాగత మిచ్చారు రాష్ట్రపతికి "నన్ను రాజకీయాలలోకిగాని, వివాదాలలోకిగాని లాగవద్దండి. నేను రాష్ట్రపతిగా అన్ని రాజకీయ పక్షాలకూ చెందిన వాడిని. రాజకీయ పక్షాలన్నీ స్థిరపడి. ప్రజాస్వామ్యం పటిష్టం కావడం నా అభిమతం" అన్నారు రాష్ట్రపతి. ఆయన జూన్ 26 వ తేదీన 50 లక్షలతో మూసీ నదిపై నిర్మించనున్న వంతెనకు శంకుస్థాపన చేశారు. "మూసీ నదిపై మరెన్నో వంతెనలు ఎడాలి. అంత పెద్ద బ్రహ్మపుత్రా నదిపై ఒకేఒక వంతెన వున్నందుకు నేను విస్తుపోయాను. మనకు మనస్సున్నది వుంటే, దానికి చొరవ, చేతనత్వం కూడా తోడయితే పరిష్కరించరాని సమస్యలంటూవుండవు" అని నొక్కిచెప్పారు రాష్ట్రపతి.

## ఉపశ్రుతి :—

"ఏం సార్, ఈ మధ్య రాజకీయనాయకులు పత్రి రచయితకు ఉపదేశాలిస్తున్నారే!" అన్నారు ఒక పెద్దమనిషితో. "రాజకీయనాయకుల తప్పేముందండీ? రచయితలు అవికావాలి, ఇవికావాలి అని వాళ్ల వెంటబడితే, ఏ వుపదేశమన్నా చేస్తారు. పూర్వపు ఋషులలాగ ఉపకారనిరపేక్షంగా వుండమనండి. రాజకీయనాయకులే వారి వద్దకు వెళ్ళతారో లేదో చూడండి." అన్నారు మరొక పెద్దమనిషి.

— తిరుమల రామచంద్ర.







# ఉత్తరాలు

(6వ పేజీ తరువాయి)

30-6-78 తేదీ మీ (మా) పత్రికపై ప్రచురించిన 'పుష్పవికాసం' పిల్లలకు అకర్షణీయముగా, వయసులో నున్నవారికి క్రొత్త కోరికలు కలిగిస్తూ, వృద్ధాప్యములో నున్నవారికి యవ్వనములోని రోజులు గుర్తు చేస్తున్నాయా అన్నట్టున్నవి. కథలు ఇంటరెస్టింగ్.

ఏ. రామ్‌ప్రసాద్ (హైదరాబాదు)

* * *

ముద్దుగులాబీ మొగ్గలావున్న మా పత్రిక ఈ రోజు
విరవిచ్చిన గులాబీలా విచ్చుకొన్నది.
సినీతారలతో విలసిల్లే మా పత్రిక ఈ రోజు
పూవులలో పదిలంగా ఒదిగివున్నది.
రంగుపూతలు పూసుకునొచ్చే మాపత్రిక ఈరోజు
ఇంద్రధనస్సులా ధగధగ మెరుస్తున్నది.
ముగ్ధమోహనంగా ఉంటున్న మాపత్రిక ఈరోజు
స్నిగ్ధసౌందర్యంతో మనసును మురిపిస్తున్నది

జె.పి.యన్.యస్. నెహ్రూ. (బండార్లంక,)

## మాయాజాలం

23-6-78 వ తేదీ వారపత్రికలో భావరాజు కామేష్‌గారి మాయాజాలం మతికట్టులో మైండ్ రీడింగు గురించి వ్రాసినారు. వారు చెప్పిన సమాధానం డొంక తిరుగుడుగా ఉన్నది. అసలు రహస్యము ఏమంటే ఏ సంఖ్యనైనా 9 చేత గుణించిన యెడల, వచ్చిన అంకెల మొత్తము 9 అగును. మైండ్ రీడింగులో ఇచ్చిన లెక్కలో 3 అంకె కొట్టివేయగా వచ్చిన సంఖ్య మొత్తం 24 అనగా వాటి మొత్తము 2 + 4 = 6 ఈ 6ను 9 అంకెలో నుంచి తీసివేయగా 3 వచ్చును. కనుక కొట్టివేసిన సంఖ్య 3, 9 చేత గుణించిన లెక్కలకు మాత్రమే ఇట్లు కొట్టివేసిన అంకె చెప్పగలము. ఏమనగా గుణించగా వచ్చిన అంకెల మొత్తం 9 అగును.

ఏ. విశ్వేశ్వరరావు (యలమంచెలి)

* * *

ఈ మధ్య మీ వార పత్రికలో ప్రచురింపబడుతున్న భావరాజు కామేష్‌గారి "మాయజాలం మతికట్టు" శీర్షికలో అనవసరమైన విషయాలకు ఎక్కువ ప్రాముఖ్యము అవసరమైన దానికి (మాయాజాలంపోర్షను) తక్కువ ప్రాముఖ్యము ఇవ్వడం జరుగుతుంది. 23-6-78వ తారీఖున పత్రికలో ప్రచురింపబడిన శీర్షికలో ఉన్న లోపం ప్రస్తావిస్తాను.

తలుచుకున్న సంఖ్య 8378 అనుకోండి. 9చే గుణించగా 75402; కొట్టివేసిన అంకె 'o' అనుకోండి అప్పుడు 7542. మిగిలిన అంకెల మొత్తము 18, తొమ్మిదిచే భాగింపబడే తదుపరి పెద మొత్తము 27. భావరాజు కామేష్‌గారి ప్రకారం కొట్టివేసిన అంకె = 27-18 = 9; కాని కొట్టివేసిన అంకె = 0. ఒకవేళ మిగిలిన అంకెల మొత్తము తొమ్మిదిచే భాగించబడినట్లయితే కొట్టివేయబడిన అంకె "o" గాని '9 గాని అవుతుందని భావరాజు కామేష్‌గారికి తెలియదు గాబోలు!

బి. వెంకటేశ్వరరావు. (అకోలా.)

## ఈనాటి వనితాలోకం

16-6-78 మా అభిమాన ఆంధ్రసచిత్ర వార పత్రిక వనితాలోకం శీర్షికన శ్రీమతి కొండముది రుక్మిణీదేవిగారి "సంధి యుగంలో మహిళ" వ్యాసం వాస్తవానికి ఒహూ దగ్గరనిపిస్తుంది. ప్రతి మగవాడి పురోభివృద్ధికి వెనక ఒక స్త్రీ ఉండి తీరుతుంది అన్న మాటలు విశేష స్థాయి నందుకున్నాయి. స్త్రీని అర్ధ నగ్నమైన అడ్వర్‌టైజ్‌మెంట్ల ద్వారా అవమానిస్తున్నారు. దీనిని వెంటనే రద్దు చేయించాలి అన్న మాటలు సంఘానికి ఒక ప్రత్యేక మయిన మేలుకొలుపా? అన్నట్లుంది.

గవిని సరసయ్య: కె. యు. సి. (వరంగల్)

## కథలు

సినీతారల ముఖచిత్రాలను చూసి చూసి విసుగెత్తిన మాకు 30-6-78 నాటి ముచ్చటైన మూడు గులాబీలతో సర్వాంగ సుందరము బన ముఖ చిత్రముతో వెలువడిన పత్రిక ఎంతో ఆనందాన్ని కల్గించింది. కథల్లో 'చిలుకలు' 'ప్రేమాయణం" 'సరోజ' చాలా బాగున్నాయి

ఏ పి ప్రభాకర్, (కర్నూలు)

* * *

కథల విషయంలో "కలసిరాని కలలు" కథ చాలా బాగుంది. "మోహనరూప" సీరియల్ నవల చాలా ఇంట్రెస్టు కలుగుతుంది. మంచి డైలాగులతో నిండుగా ఉంది.

కరకవలస రామకృష్ణ. (ఖరగ్‌పూరు-1.)

## శ్లోకంలో గమ్మత్తు

శ్లో॥ "యామాతా మమతా మాయా,
మా మర్యాదను వ్రాయమా,
తాఫ్యో నాగగనా ఫ్యోతా,
మక్ష గక్ష క్షగ క్షిమ"

ఈ శ్లోకంలో ఒక్కొక్క చరణాన్ని క్రింది నుండి పైకి చదివినా, పై నుండి క్రిందికి చదివినా ఒకే లాగుంటుంది. మరియు నిలువుగా చివరి చరణాలను కలిపి చదివినా ఒకే లాగుంటుంది.

లీడ వెంకటశ్రీనివాసు (పాలకొల్లు)

**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikariunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor. S. Radhakrishna**

వాచీ కేసు అందచందాలొకసారి పరికించండి.
పౌరుషంగల పురుషత్వానికి తగిన జోడు అంటారు.
పోనీ డయిల్ చూడండి.
గంభీరంగా వుంటుంది—కాని అనాగరికంగా వుండదు;
సజీవంగా కన్పిస్తుందే గాని మోటుగా వుండదు.
చివరికి వాచీ ముల్లు కూడా ప్రత్యేకత కలిగివున్నాయి.
పదహారు సంవత్సరాల అనుభవం రంగరించి పోసి
యీ వాచీ లోపలి భాగాలు రూపొందించారు—వంక
పెట్టడానికి వీలులేకుండా పనిచేసే నాజూకైన
బాలెన్సువీల్, అతి చిన్న ఎస్కేపుమెంటు; బలమైన
మెయిన్ స్ప్రింగు, సాఫీ అయిన గేర్లు—చూస్తూనే
మీకే సంగతి అర్థం అవుతుంది.

"విజయ్" ని చేపట్టండి.
"విజయ్"
నాలుగు ప్రస్ఫుటమైన డిజైన్స్‌తో
నలుపు, తెలుపు, నీల, బూడిద డయిల్స్‌తో.

# హెచ్.ఎమ్.టి
# కొత్త వాచీలు

స్టెయిన్‌లెస్ స్టీలు కేసు.
17 జూయల్స్. పారాషాక్.
యాంటీ మాగ్నటిక్.
వాటర్ రెసిస్టెంట్.

# విజయ్

అంటే విజయం
మా దృష్టిలో దీనికి యింతకుమించిన
చక్కటి పేరింకొకటి దొరకదు.

మార్కెటింగు విభాగం




దేశమునకు కాలం
సూచించువారు.